శ్రీమతే రామానుజాయనమః

శ్రీ పిళ్లలోకాచార్య ప్రసాదిత

అష్టాదశ రహస్యాంతర్గత

# అర్చిరాది

ఆంధ్రానువాదము

అనువాదకులు

శ్రీమాన్ కో. కం. శ్రీ వేంకటేశ్వరస్వామివారు

సింహాచలం

ప్రకాశకులు

శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ జీయరు స్వామివారు

శ్రీమదుభయ వేదాంతాచార్య పీఠ వ్యవస్థాపకులు

రాక్షస ఆశ్వయుజము 1975 వెల : రు. 6-00

శ్రీమతే రామానుజాయనమః

పిళ్ళై లోకాచార్యర్ తిరువడిక శే శరణమ్.

# అర్చిరాది - ప్రథమ ప్రకరణము

## తనియన్ :

పోర్ మణ్డలశ్శఙ్గుతణ్డు విల్ వాళ్ పుకరాఴి వైయోన్,
కార్ మణ్డలత్తిన్ను కాణ్బార్ తమక్కు క్కతిరొళియోన్
ఏర్ మణ్డలన్దన్నై యెయ్ తుమ్ వఴియై యినితురైత్తాన్
పేర్ మణ్డల కురువెన్ను ముడుమ్బై ప్పిఅన్దవనే.

ప్ర. అ :- పేర్ మణ్డలకురువెన్నుమ్-జగదాచార్యులనెడి పేరుగల-ముడుమ్బైప్పిఅన్దవనే - ముడుమ్బై నగరమం దవతరించిన పిళ్ళై లోకాచార్యులువారు, మణ్డలం-మండలాకారముగా, పోర్-యుద్ధము చేసెడి, శఙ్గు - శంఖము, తణ్డు-గద, విల్ - ధనుస్సు, వాళ్ - ఖడ్గము, పుకర్ - తేజస్సుగల, ఆఴి - చక్రము, ఇవైయోన్-ఇవికలవాడైన సర్వేశ్వరునియొక్క, కార్ మణ్డలత్తిన్ను - సౌందర్యముగల పరమ పదమునకు వెళ్ళి, కాణ్బార్ తమక్కు-సేవించేవారికి, కతిర్-కిరణములు గల, ఒళియోన్ - సూర్యునియొక్క, ఏర్ - సుందరమైన, మణ్డలన్దన్నై - మండలమును, ఎయ్ తుమ్ - పొందేటటువంటి - వఴియై మార్గమును, (అర్చిరాది మార్గమును) ఇనితు - భోగ్యముగా, ఉరైత్తాన్-సాయించినారు.

1. శ్రియఃపతియాన సర్వేశ్వరనుక్కు విభూతి ద్వయముమ్ శేషమా యిరుక్కుమ్.

---

౧. "మణ్డలన్దన్ని లేకుమ్బడియై" అని పాఠాంతరము. మండలము లోనుండి వెళ్లే ప్రకారమును. అని యర్థము.

ములుగల లక్ష్మీదేవియును నీవును మాత్రమే వర్తించుచుండగా గాంచిన చాతుర్యమునుచూచి విడచితిని. నీతిరువడికళ్ళనే యాశ్ర యించితిని.

3. లీలావిభూతియిలుళ్ళార్ అవర్కళై ప్పోలే ఛన్దానువర్తికళ న్ఱిక్కే సంకల్పాను విధాయికళాయ్.

లీలా విభూతియందున్నవారు ఆభోగవిభూతియందున్నవారి వలె స్వేచ్ఛా సంచారులు కాకుండా నాతని సంకల్పము ననుసరించిన వారై.

4. (నమ ఇత్యేవవాదినః) ఎన్గిఅతుక్కెతిరాక, (ననమేయమ్, ఈశ్వరోహమ్) ఎన్గిఅపడియే మన్నైయడైవే (యానేయెన్త నతే) ఎన్టవర్కళ్.

పరమపదవాసులు (నమః అనే చెప్పేవారు) అను దానికి వ్యతి రేకముగా (నేనొకరికి వంగువాడనుకాను. నేనే ఈశ్వరుడను) అనుచు యిండ్ల వరుసగా (ప్రతివారును) (నేనే, నాదే) అనినవారు.

5. (పణియావమరరాయ్) ఇరుక్కుమిరుప్పుక్కెతిరాక (పుత్తోర్ తెయ్వంపాడి యాడిప్పణిన్దు) (మిక్కార్ వేదవిమలర్) ఎన్గిఅపడియే అవర్కళై ప్పోలే (పెరుమక్కళాయిరాతే) (శిఱియార్ శివప్పట్టార్) ఎన్గిఅపడియే శిఱియరాయ్.

(ఇతర దేవతలను ననుసరించని నిత్య సూరులవలె) నుండవల సిన ఉనికికి వ్యతిరేకముగా (ఇతర దైవమును పాడియాడి నమస్క రించువారై) (అధికులై వేద ప్రతిపాద్యులైన నిర్మలులు) లనబడు చున్న ప్రకారముగా నిత్యసూరులవలె (మహా పురుషులై యుండక) (శైవులు స్వల్పులు) అనునట్లు స్వల్పులై.

6. (అయర్వాఱు మమరర్ కళ్) ఎన్గిఅపడియే అవర్ కళై ప్పోతే
దివ్యజ్ఞానోపపన్న రాయిరాతే (అఱివిలామనిశరాయ్)
(ఒళిక్కొణ్డశోతిక్కు) ఎతిరాక (అఱ్రుక్కుడమ్బై) పరిగ్రహిత్తు.

(మరపులేని యమరులు) అనుచున్న ప్రకారముగా నిత్య సూరులవలె దివ్యజ్ఞానము కలవారై యుండక (జ్ఞానములేని మనుష్యులై) వారివలె (తేజోమయమైన దివ్య మంగళ విగ్రహమునకు) వ్యతిరేకముగా (మురికితోకూడుకొనిన శరీరమును) పరిగ్రహించి.

7. (విపన్యవః, విణ్ణోర్ పరవుంతలై మకన్) ఎన్గిఱతుక్కు ఎతిరాక
(ఉలకిల్ కణ్డవాతొణ్డరై ప్పాడి)

(స్తుతిశీలులు, నిత్యసూరులు స్తోత్రముజేయదగిన నాయకుడు) అనుచున్నదానికి వ్యతిరేకముగా (లోకమందు చూచుచున్న విధముగా నీచులను పాడి)

8. (ఉనక్కే నామాట్చెయ్ వోమ్) ఎన్గిఅపడియే అవనుక్కు
(ఆట్చెయ్యాతే) (మారనార్ వరివెజ్జిలైక్కాట్చెయ్ తు)

(నీకే మేము దాస్యము చేసెదము) అనుచున్న ప్రకారముగ వారివలె నాథర్వేశ్వరునికి (దాస్యముచేయక) (మన్మధునియొక్క సుందరమై క్రూరమైన ధనుస్సునకు దాస్యమునుచేసి) కాముకులై.

9. (తొణ్డాపూణ్డముతముణ్ణాతే) (పావైయర్ వాయ ముతముణ్డు)

(వారివలె దాస్యమునకు తగునట్లలంకరించుకొని గుణామృత పానమును చేయక) (ప్రతిమలవంటి స్త్రీలయొక్క అధరామృత పానమునుచేసి)

10. (సపకథాభవతి ద్విథాభవతి) ఎన్గిఱతుక్కుఎతిరాక (కులన్దానెత్తనైయుం పిఱన్దు)

(ఆముక్తపురుషుడు భగవంతునిసేవకై ఒకవిధముగా నగుచున్నాడు. రెండువిధములుగా నగుచున్నాడు.) అనుచున్నదానికి వ్యతిరేకముగా (ఎన్నికులములయందో పుట్టి)

11. (ఉరువార్ శక్కరం శఙ్గం శుమన్దజ్గవనో డొరుపా డుళ్లలాతే) (ఆక్కై-యిన్ వళ్లి యుళ్లన్ను)

(సుందరమైన చక్రమును శంఖమును మోసుకొని పరమపదమున నాసర్వేశ్వరునితో నొకప్రక్కను సంచరించక) (శరీరము యొక్క మార్గము ననుసరించి)

12 (ఏతద్వ్రతం మమ) ఎన్నిఅవనుడైయ వ్రతత్తు క్కెతిరాక (యాతానుం పత్తినీఙ్గుం విరతత్తై) ఏఱిట్టుక్కొణ్డు.

(ఇది నావ్రతము) అనే సర్వేశుని యొక్క వ్రతమునకు వ్యతిరేకముగా (ఏదైనను పట్టి యెడబాసెడి ఉపాయాంతరమును) తనపై బెట్టుకొని.

13. (అవర్ తరుం కలవియే కరుది యోడినేన్) ఎన్గిఅపడియే (అలమ్పురిన్ద నెడు న్దడక్కై-క్కు-మ్) ఎట్టాతపడి కైకళ్లియవోడి.

(ఆయుపతులు యిచ్చెడి సంశ్లేషనే తలంచి పరుగెత్తితిని) అనునట్లు (చాలుననేటట్టుగా నిచ్చెడి దీర్ఘమై విశాలమైన చేతికి కూడా) నందనిప్రకారముగా పరుగెత్తి.

14. (అల్పశారజ్గళవై శువైత్తకన్ను) పోరక్కడవరా యిరుప్పర్ కళ్.

(అల్పసారములైన యాశబ్దాది విషయముల నాస్వాదించి) ఎడబాసి పోవలసినవారై యుందురు.

15. ఇవర్కళ్ తణ్ణైమై ప్పార్త్తు కైవిడాతే స్వాభావిక సంబంధమే హేతువాక విడమాట్టాతే (ఎతిర్ శూழ్ల్ పుక్కు త్తిరికిఱ సర్వ భూతసుహృత్తాన సర్వేశ్వరనుడైయ యత్నవిశేషం ఒరునాళ్వరై యిలే ఓరవకాశత్తిలే ఫలిత్తు.

వీరి నీచతను చూచి చేయి విడువక వీరితో తనకుగల స్వాభావిక సంబంధమే హేతువుగా విడువజాలక (వీరిని చక్కబరచుటకై ఎదురుగాను చుట్టును ప్రవేశించి) (అనగా అనేకావతారములెత్తి) తిరుగుచున్న సర్వభూతసుహృత్తైన సర్వేశ్వరునియొక్క యత్నవిశేషము (ఒకానొకనాడు) ఒకానొక యవకాశమందు ఫలించి.

16. అద్వేషాభిసంధియై యుడైయనాయ్ మోక్షసమీక్షాయుక్తనాయ్ ప్రవర్తమానవైరాగ్యనాయ్ వివేకాభినివేశియాయ్ సదాచార్య సమాశ్రయణం పణ్ణి.

యీచేతనుడు భగవద్భాగవతవిషయమై అద్వేషసంకల్పము కలవాడై మోక్షమందలిదృష్టితో కూడుకున్నవాడై ప్రవర్తించుచున్న వైరాగ్యముకలవాడగును. అంత వివేకమందభినివేశముకలవాడై సదాచార్యసమాశ్రయణమును చేయును.

17. (శెయ్త వేళ్వియనాయ్) సంసారత్తినుడైయ కొడుమైయై యనుసంధిత్తు.

(చేసినయజ్ఞముకలవాడై) అనగా భగవత్ప్రీతికర వ్యాపారములు చేయగ సంసారముయొక్క క్రౌర్యమునను సంధించును.

18. సర్వాస్యగతమాన మణ్డూకంపోలేయుమ్ కాట్టుత్తీకదువిన మాన్పేడైపోలేయుమ్. (ఇరుపాడెరికొళ్ళియి నుళ్ళెఱుమ్బుపోలేయుమ్.) (ఆవారార్ మఱైయెన్ఱలైనీర్కడలుళ్మున్దుచ్నావాయ్పోలేయుమ్) (ఆర్త్తుళ్గ్జీ).

అంతనాతడు పామునోటిలో పడిన కప్పవలెను, కారుచిచ్చు కబళీకరించిన యీడ లేడివలెను (రెండుప్రక్కలను ప్రజ్వలించుచున్న కొరకంచునందలి చీమవలెనున్నా) (సహాయమయ్యేవారెవరు ? అని తరంగించుచున్న జలముగల సముద్రమందు మునిగిపోవుచున్న ఓడవలెనున్నా) (మిక్కిలి తల్లడిల్లి) ఓ శ్రియఃపతీ!

19. (పల నీ కాట్టిపడుప్పాయో, ఇన్నమ్దైడుప్పాయో, ఐవర్ తిశై తిశై వలిత్తెత్తుక్కిన్ఱనర్, కూత్తై శోఱివై తా వెన్ఱు కుమైత్తు ప్పోకార్.) ఎన్ఱుఇన్దిరియజ్గళినుఢైయ కొడుమైయై నినైత్తు కూప్పిట్టు.

(అనేకమైన శబ్దాదివిషయములను కనపరచి సంసారములో పడవైచెదవా? ఇంకను చెడగొట్టెదవా? పంచేంద్రియములును శత్రువులవలె ప్రతిదిక్కునకు బలాత్కారముగా లాగి కదవేయుచు న్నవి. వస్త్రము అన్నమునను వీటిని తెమ్ము అని బాధించును.) అని యింద్రియములయొక్క క్రౌర్యమును తలంచి మొఱబెట్టును.

20. (ఎణ్ణాఅా త్తుయర్ విళైక్కుమివై యెన్నవులకియత్కై ఉయిర్మాయ్తల్ కణ్డాత్తేన్, ఓఓ వులకిన తియల్వే.) ఎన్ఱు సంసారికళిఱ్ఱువుక్కు నొన్దాత్తమాట్టాతే.

(తలంచుటకు శక్యముగాని దుఃఖములను ఫలింపజేసెడి యివి ఏమి లోకస్వభావములు? ప్రాణము నశించుటను చూచి సహింపజాలను. ఓహో లోకముయొక్క స్వభావము) అని సంసారులయొక్క నష్టమునకు నొచ్చుకొని సహించజాలక.

21. (పేయరే యెనక్కు యావరుమ్, నాట్టు మానిడత్తో డెనక్కరితు, నాట్టారో డియల్వొళిన్దు) ఎన్ఱు శొల్లుకిఱపడియే పిరా

ట్టికు రాక్షసికళోట్టై సహవాస మసహ్యా మానాప్పోలే (మెయ్యిల్ వాళ్గై యై మెయ్యెనక్కొండు) (ఉజ్జీయే వృద్ధైయే వుకన్దోడుకిఱ) శౌరిచింతావిముఖరాన సంసారికళోట్టై సహవాసం దుస్సహమాయ్.

లోకులందరును పిచ్చివారు. లోకమందున్న మనుష్యులతో సహవాసము నాకు దుశ్శకము. లోకులతో సంబంధము పోవలెనని చెప్పుచున్న ప్రకారముగా పిరాట్టికి రాక్షసస్త్రీలతో సహవాస మసహ్యమైనట్లు (సత్యముకాని గృహసౌఖ్యమును సత్యమనుకొని తిండినే బట్టనే సంతోషించి పరుగెత్తుచు) సర్వేశ్వరుని ధ్యానమునుండి విముఖులైన సంసారులతోటి సహవాసము దుస్సహము.

22. (ఇన్నిత్తనిరైక్క యుని యాముఱామై) (ఎజ్జీని త్తలైప్పెయ్వనే-నాళేలటియేన్, వానులక న్త్తిన్ద్ర యెన్నైయ్తువతు, తరియేనిని, కూవిక్కొళ్ళుమ్ కాల మిన్నుం కఱుకాతో) ఎన్ను భగవదనుభవం పెఱామైయాలే పెరువిడాయ్ప్పట్టు.

(ఈవిధముగానున్న స్వభావమును యికను మేము పొందకుండా చేయుము.)( నేను నిన్ను యెక్కడ నిక పొందెదను? అట్లు పొందెడు దినముల నేనెఱుగను, నేనావరమపదమును తెలుసుకొని ఎప్పుడు పొందునది? ఇకను ధరించజాలను. నీవు నన్ను పిలుచుకొనే కాల మింకను సమీపించదా?) అని భగవదనుభవము లభించక పోవుటచే గొప్పతృష్ణను పొందును.

23. (శీయోడుం శేరు మెంగ్రుకాయ్, కాణవారా యెన్టెన్ను కణ్ణుం వాయుం తువర్న్దు) కాణ ప్పెఱామైయాలే (ఒరుపక లాయిరమూళ్ళియాయ్) (కృతకృత్యాః ప్రతీక్షంతే) ఎన్గిఱపడియే (ఆక్కైవిడుమ్బొళుదైత్తె) మనోరథిత్తు.

(అగ్నితోఁచేరిన మైనమువలె సేవించుటకు రమ్మని పిలచి పిలచి కనులు నోరు యెల్లబడి) చూచుటకు లభించకపోవుటచే (ఒక పగలు వేయికల్పములగుచున్నవి.) (కృతకృత్యులు మృత్యువును ప్రతీక్షించుచున్నారు) అనుచున్న ప్రకారముగా (శరీరమును విడచే ప్రొద్దును) కోరును.

24. మహిషియినుడైయ వుచ్ఛిష్టత్తై విరుంబుం రాజపుత్రనై ప్పోలే త్తాన్ త్యజిత్త దేహత్తై విరుమ్బుకిఱ యీశ్వరనై (మఱ్ఱవొట్టు) ఎన్ఱపేక్షిత్తు.

భార్యయొక్క ఉచ్ఛిష్టము నాదరించు రాజపుత్రునివలె తాను విడచిన దేహము నాదరించుచున్న సర్వేశ్వరుని (యీ దేహమును నశించుటకు సమ్మతించుము) అని యపేక్షించును.

25. (ఉణ్డిట్టా యిని యుణ్డొళ్ళియాయ్, ముత్తక్కరన్దొళిత్తాయ్ తిరువాణై నిన్నాణై కణ్డాయ్, ఇని నాన్ పోకలొట్టేన్.) ఎన్ఱు తడుత్తుం తళైత్తుం పెఱవేణ్డుమ్బడి పరమభక్తి తలై యెడుత్తల్, అవ్వళవన్ఱిక్కే ఉక్తిమాత్రత్తిలే యన్వయిత్తల్ (నానుం పిఱన్దమైపొయ్యన్రే. తజ్గళ్ తేవరై వల్లపరిశువరువిప్ప రేల్ అతుకాణ్డుమే) ఎన్ఱుశొల్లుకిఱపడియే (పఱ్ఱుతా కాల) వళ్ళివైయటిన్దు.

(నాయాత్మాత్మీయములను అనుభవించితివి, యిక నాయను భవమును విడువుము. అంతటను వ్యాపించి దాగియుంటివి. లక్ష్మీ దేవితోఁడు నీతోఁడుచూడుమా. ఇక నేను నిన్నుపోవుటకొప్పను) అని యడ్డి నిర్బంధించి లభించవలసిన ప్రకారముగా పరమభక్తి తల యెత్తును. నేను నాభక్తుని మరణకాలమునస్మరించి పరమ పదమునకు గొనిపోవుదును. అన్నది ఉక్తిమాత్రమందే యన్వయించుట

కాకుండా (నేనునుపుట్టినది సాధురక్షణమునకేగదా ? అది యసత్యముకాదా ? తమస్వామిని తగినప్రకారములచే రప్పించిన వారైతే యది చూచెదము) అని యాభార్య పురుషకారముద్వారా చెప్పుచున్న ప్రకారముగా (వ్యర్థముగాని) మార్గమును తెలుసుకొని.

26. (వేఱాకవేత్తియిరుక్క-) మవనైప్పత్తుతల్ శెయ్తు (తెళి వుత్తు వీవిన్ని) నిఱ్కు-మవనుక్కు- శరీరావసానకాలత్తిలే, యీశ్వరన్ తన్ తిరువడికళిలే యివన్ తలైశాయ్ త్తవన్నుతుడక్కి (ఋణంప్రవృద్ధమ్.)(ఉన్నడియార్కెన్ శెయ్వనెన్తేయిరుత్తీసీ) ఎన్గిఅపడియే తనిశాళనాయ్, ప్రత్యుపకారం తేడిత్తడుమాఱి.

(విలక్షణముగా స్తోత్రము జేసియుండే) యాచార్య నాశ్రయించుటంజేసి (జ్ఞానముపొంది విచ్ఛేదము లేకుండా) నిలచేవానికి శరీరావసానకాలమందు సర్వేశ్వరుడు తన తిరువడికళ్ళయందు వీడు తలవంచిననాడు మొదలుకొని వీడు చేయునదంతయు (వృద్ధిపొందిన ఋణమువలెతలంచి "నీదాసులకు నేను ఏమిచేసెదను" అనే ఉంటివి) అనుచున్న ప్రకారముగా మిక్కిలిఋణపడినవాడై, ప్రత్యుపకారమును వెదకి తల్లడించును.

27. (తిరుత్తిప్పణికొళ్ళనినైత్తు) పల్వాజ్గిన పామ్బుపోలే సంసారం మఱువలిడాత పడి యడి యఱుక్క-చ్చెయ్ తేయుమ్ పిణమెఴున్దు కడిక్కి-అతో వెన్దతిశజ్క-పణ్ణి, అమర్న్దనిలత్తిలేకొణ్డుపోకైయిలే విరైన్దు.

(వీనిని దిద్ది కైంకర్యమును స్వీకరించుటకు) తలంచి, కోరలుతీసిన పామువలె సంసారమనువర్తించని ప్రకారముగా మూలమును ఛేదించినప్పటికిన్నీ పీనుగులేచికరచునేమో యని శంకించి అమరియున్న స్థలమందు (పరమపదమందు) తీసుకొనిపోవుటయందు త్వరపడును.

28. ఇవన్ విడాయ్ కుళప్పడియెత్తుమ్పడి కడల్ పోలే (ముత్తప్పరుక వేణ్డుమ్పడి) పెరువిడాయై యుడైయనాయ్ (ఒరుమానొడి యుమ్పిరియాతే) చక్రవర్తి పెరుమాళ్ తిరువభిషేకత్తుక్కు వశిష్ఠ వామదేవాది కళైయఝైత్తు ప్పారిత్తాప్పోలే నిత్యసూరి కళైయఝైప్పిత్తు వఝియై క్కోడిప్పిప్పతాయ్ కొణ్డు

వీరియొక్క తృష్ణ గోప్పదము అనే ప్రకారముగా (సముద్రము వలె (పూర్తిగా పానము జేయవలసిన ప్రకారముగా) పెద్దతృష్ణగల వాడై (ఒక తృటికాలమున్నూ యెడబాయకుండా) దశరధ చక్రవర్తి పెరుమాళ్ళ పట్టాభిషేకమునకు వసిష్ఠ వామదేవాదులను పిలచి యత్నించినట్లు నిత్యసూరులను పిలిపించి మార్గము నలంకరింప చేయును.

29. (అలంకారవిధింకృత్స్నం కారయామాస వేశ్మని) ఎన్గిఅపడియే (వీడుతిరుత్తి) అనాది కాలార్జితంగళాయ్, ఇవ నాచార్య సమాశ్రయణం పణ్డినవన్తే తుడఙ్గి (అరుళెన్నుంతణ్డాలడియుణ్డు) మూక్కుం ముకముం శితైన్దు.

(గృహమందలంకార విధినంతను చేయించెను). అనుచున్న ప్రకారముగా (పరమపదము నలంకరించి, అనాది కాలము నుండి సంపాదించబడినవై వీ డాచార్య సమాశ్రయణము చేసిననాడే మొదలుకొని (కృప యనెడి దండముచేత దెబ్బతిని) ముక్కు ముఖము చితికిపోయి).

30. (పఴు పోలే వీ త్తిరుక్కై) త్తవిర్న్దు (మడియడక్కినిల్లాతే.) శరక్కువాఙ్గి (మరుఙ్గుం కణ్డిలమాల్) ఎన్నుమ్పడి యొలిత్తు వర్తిక్కిఅ పూర్వాఘఙ్గళైయుం, ఉత్తరాఘఙ్గళైయుం అను

కూలర్ విషయమాకవుమ్, ప్రతికూలర్ విషయమాకవుమ్ వరుణనై క్కుఱిత్తు తొడుత్తవమ్బై మరుకాంతారత్తిలే విట్టా ప్పోలే అశల్ పిశన్దేఱిట్టు, ఇవనోడు సంబంధ ముడైయరాయ్ నరకానుభవం పణ్ణుకిఱవర్ కళై (ఏతత్సంబన్ధినశ్చాన్యే) ఎన్గిఱ పడియే స్వర్గస్థరాప్పడి నినైప్పిట్టు.

(పూర్వోత్తరాఘములు పూర్వమువలె యుండుటను) విడచి (బట్టను అణచుకొని ఒకవారగా నిలువక) సరకునంతను తీసుకొని (సమీపమందుకూడా మనమే ఆశ్చర్యము) అనే ప్రకారముగా, పూర్వము దాగి వర్తించుచున్న పూర్వాఘములనున్నూ, ఉత్తరాఘములనున్నూ, అనుకూలుల విషయముగానున్నూ, ప్రతికూలుల విషయముగానున్నూ వరుణుని గురించి సంధించిన బాణమును మరుకాంతారమందు విడచినట్టువలె పొరుగును బ్రద్దలుచేసి యారోపించును. వీనితో సంబంధముకలవారై నరకానుభవము చేయుచున్న వారిని (వీనిసంబంధులైన యితరులును) అనుచున్నప్రకారముగా స్వర్గమందుండేవారినిగా సంకల్పించును.

31. (ఊఢః పంచాత్మనా తేన తార్క్ష్యరూపేణ, శ్రుమ్వఱవైత్తా నేఱిత్తిరివాన్) ఎన్ఱు శొల్లుకిఱపడియే (అరుళాళ్పుళ్ కడవీర్) ఎన్ఱుయివనాశై ప్పట్టపడియే (కొత్తప్పాళ్ళన్దేఱి) వన్దు తోన్ఱి

(పంచోపనిషన్మయుడైన గరుడరూపుడైన వానిచే వహించబడుచున్నవాడై) అనియును చెప్పుచున్న ప్రకారముగా (దయాసముద్రుడైన గరుత్మంతుని మావీధిగుండా నడపించి) అని వీడాశపడిన ప్రకారముగా (జయశీలుడైన గరుత్మంతునొకనిని) ఎక్కివచ్చి దర్శనమిచ్చును.

32. (మజ్ఞ్జియర్ పొన్మలై మేలెழுన్ద మాముకిల్పోల్) వడివై యనుభవిప్పిత్తు, ఆతివాహికరై యழைత్తరుళి, ఇవనై సత్కరిక్కుం క్రమత్తిలే సత్కరిక్క వరుళిచ్చెయ్యు.

(మేఘములుగలదై యున్నతమైన మేరుపర్వతముపైని విజృంభించిన గొప్ప మేఘమువంటి) తిరుమేనిని యనుభవింపజేసి, ఆతివాహికులను పిలచి కృపజేసి, వీనిని సత్కరించే క్రమమందు సత్కరించుటకు ఆదేశించును.

33. పిన్బు. (ఇన్ద్రియైర్మనసి సంపద్యమానై ర్వాఙ్మనసి సంపద్యతే. మనః ప్రాణే, ప్రాణ స్తేజసి, తేజః పరస్యాం దేవతాయాం) ఎన్గిఱపడియే బాహ్యకరణఙ్గళ్ అంతఃకరణత్తిలే శేర్న్దు, అంతఃకరణమ్ ప్రాణనోడే శేర్న్దు, ప్రాణన్ ఇచ్చేతననోడే సంబంధిత్తు ఇవన్ భూతసూక్ష్మ విశిష్టనాయ్ క్కొణ్డు పరమాత్మావిన్ పక్కలిలే శేరుమ్.

తరువాత ("మనస్సునందు కూడుకొనుచున్న యింద్రియములతో" ననియును. వాక్కు మనస్సుతో కూడుకొనుచున్నది. మనస్సు ప్రాణమందు, ప్రాణము తేజస్సునందు, తేజస్సు పరదేవతయందు) అనుచున్న ప్రకారముగా బాహ్యేన్ద్రియములు అంతఃకరణమందు చేరి, అంతఃకరణము ప్రాణముతో చేరి, ప్రాణము యీచేతనునితో సంబంధించి వీడు భూత సూక్ష్మముతో కలసినవాడగుచు పరమాత్మపట్లను చేరును.

34. పిన్బుఘుర్మకాలత్తిలే ఆదిత్యకిరణత్తాలే తప్తనానవన్ నిழలై మరత్తైప్పత్తి ఇళైప్పాఱు మాపోలే సంసార దుఃఖార్కతాప తాపితనానవన్ (వాసుదేవ తరుచ్ఛాయయై) కిట్టి విశ్రమిత్తు,

తరువాత గ్రీష్మ కాలమందు సూర్యకిరణములచేతను తపింప జేయబడినవాడు నీడగల వృక్షము నాశ్రయించి శ్రమతీర్చుకొన్నట్లు సంసార దుఃఖమనెడి సూర్యతాపముచేతను తపింపజేయబడిన వీడు (వాసుదేవుడనెడి వృక్షముయొక్క నీడను) సమీపించి విశ్రమించును.

35. తిరుక్కోవలూరుక్కు ప్పోంబోతు తిరుమజ్గైయాళ్వారుక్కు (త్తానుకన్దవూరెల్లామ్ తన్దాళ్ పాడి) ఎన్గిఅపడియే తిరువుల కళ్న్దరుళిన తిరువడికళే పాథేయ మా మాప్పోలే (ప్రాణ ప్రయాణ పాథేయం పుణ్డరీకాక్షనామసంకీర్తనామృతమ్) ఎన్గిఅపడియే ద్వయ వచనమే పాథేయ మాకవుమ్.

తిరుక్కోవలూరుకు పోయేటప్పుడు తిరుమజ్గైయాళ్వారుకు (దివ్య దేశముల యందెల్లా తన తిరువడికళ్ళను పాడి) అనుచున్న ప్రకారముగా లోకములనుకొలచి కృపజేసిన తిరువడికళ్ళే త్రోవభత్యము అయినట్లు, (ప్రాణప్రయాణ మందలి త్రోవభత్యము పుండరీకాక్షుని నామ సంకీర్తనామృతము) అనుచున్న ప్రకారముగా ద్వయ వచనమే త్రోవభత్యముగానున్నూ;

36 (ఏతేన ప్రతిపద్యమానాః. దేవయాన పథాసర్వే ముక్తిమార్గాభిలాషిణః) ఎన్గిఅపడియే అర్చిరాది మార్గమే పెరువఴియాకవుమ్.

(ఈ మార్గముచే పొందుచున్నవారున్నూ, ముక్తిమార్గమును కోరుచున్నవారందరు అర్చిరాది మార్గముగా వెళ్ళుదురు.) అనుచున్న ప్రకారముగాను అర్చిరాదిమార్గమే పెద్దమార్గముగానున్నూ.

37. (అణ్డత్తుప్పుఅత్తుయ్ త్తిడుమైయనాయ్) ఆ ప్తతమనాయ్ (ప్పడర్కొళ్ పామ్బణై ప్పళ్ళికొణ్డు, శురికుళ్ళల్ కమలక్కణ్ణనివాయ్, కాళమేకమాన, వరజ్గత్తుఱైయు మిన్తుణై సేవళ్ళిత్తుణై) యాకవుమ్.

(బ్రహ్మాణ్డమున కాపై గా తీసుకొనిపోయి యుజ్జీవింపజేయు స్వామిగాన) మిక్కిలియాప్తుడై (విశాలమైన శేషపర్యంకమందు పవ్వళించి ఉంగరములు చుట్టుకొనిన కేశములు పద్మములవంటి నేత్రములు దొండపండువంటి యధరముగల, కాళమేఘమైన శ్రీరంగమందు నిత్యవాసము జేయుచున్న భోగ్యమైన సహాయమైన నాశ్రియః పతియె మార్గసహాయముగానున్నా) ఏర్పడును.

38. విరజాతీరముమ్, తిల్లై వృక్షముమ్. ఆరం హ్రదతటముమే విశ్రమస్థలమాకవుమ్.

విరజాతీరమున్నూ, తిల్లైవృక్షమున్నూ, ఆరంహ్రాద సరస్సుయొక్క తీరమున్నే విశ్రమస్థలముగా నుండును.

39. (తిరుమామణి మంటపమే) పుకలిడమాకవుమ్, అర్చిరాది పురుషర్కళే ఉశాత్తుణైయాకవుమ్. (శూంళ్ళవిశుమ్బణిముకిలి) నుడైయముళ్ళక్కమే ప్రయాణపటహధ్వనియాకవుమ్.

(తిరుమామణి మంటపమే) ప్రవేశించే స్థలముగానుండును. అర్చిరాదులగు దారినిచూపు పురుషులే సల్లాపమునకు తోడైన వారుగా నుండురు. (వ్యాప్తమైన యాకాశమున కలంకారమైన మేఘములయొక్క ధ్వనియే) ప్రయాణపటహధ్వనిగానుండును.

40. (అమైన్దువళ్ళిత్తరుమ్ నజ్గళ్ వానవరీశ) నాన హార్దన్ (వళ్ళిపట్టోడవరుళ) (వానేఱ వళ్ళి) పెత్తుపోక్కిలేయొరుప్పట్టు,.

(అమరియుండి యర్చిరాది మార్గమునిచ్చు మన నిత్యసూరి నాయకుడనినట్లు) హృదయమందున్న సర్వేశ్వరుడు (మార్గమును బట్టి సంచరించేటట్టుగా కృపజేయగా) నీముక్తుడు (పరమపదమునకు వెళ్ళుటకు మార్గమునుపొంది) పోవుటయందుద్యోగించును.

41. ప్రీత్యతిశయత్తాలే అనాదికాలం తన్నైక్కుడిమైకొణ్డు పోన్ద సంసారత్తై (నరకత్తైనకున్జిశే) ఎన్గిఅపడియే పురిన్దుపార్త్తిచ్చిరిత్తు.

ప్రీత్యతిశయముచేతను అనాదికాలము తనను దాసునిగాచేసుకొని వచ్చిన సంసారమును (మనస్సా నరకమునుచూచి నవ్వేము.) అనుచున్న ప్రకారముగా వెనుక తిరిగి చూచి నవ్వును.

42. (మాకవైకుణ్ఠమ్ కాణ్బతఱ్కు) పణ్డేయుణ్డానవాశై పొంగి కొండళిత్తు మేలే మేలేపెరుక, పిరాట్టియుమ్, శ్రీవిభీషణ ప్పెరుమాళు మిలజ్గైయిల్ నిన్డుమ్ పుఱప్పట్టాప్పోలే హృదయ కమలత్తిల్ నిన్డుమ్ పుఱప్పట్టు.

(పరమాకాశమందున్న వైకుంఠమును సేవించుటకు) పూర్వమే యున్న యాశపొంగి పైకివచ్చి పైపైగా వృద్ధిపొందగా, సీతాపిరాట్టి యును, శ్రీ విభీషణాళ్వానును. లంకలోనుండి బయలుదేరినట్లే హృదయ కమలములోనుండి బయలుదేరి.

43. (శతం చైకాచ హృదయస్య నాడ్యః) ఎన్గిఅపడియే హృదయ త్తైప్పత్తికిడక్కిఱ నూత్తొరునాడియిలుమ్ సుషుమ్నై యెన్డు పేరైయుడైత్తాన మూర్ధన్యనాడియిలే విద్యామాహాత్మ్యత్తాలుమ్, దేవయానానుస్మృతియాలుమ్, ప్రసన్ననాన హార్దన్ కైవిళక్కుప్పిడిత్తు కొణ్డు పోకప్పోయ్ శిరఃకపాలత్తై భేదిత్తు.

(నూరును ఒకటిన్నీ హృదయముయొక్క నాడులు) అనుచున్న ప్రకారముగా హృదయమును పట్టియుంటున్న నూట ఒక్కనాడుల యందును "సుషుమ్న" యను పేరుగల శిరః ప్రదేశమందున్న నాడి యందు, విద్యా మాహాత్మ్యము చేతనున్నూ, అర్చిరాది మార్గము యొక్క స్మరణచేతనున్నూ ప్రసన్నమైన హృదయమందున్న సర్వేశ్వరుడు చేతి దీపమును పట్టుకొని ముందుపోగా నీతడు పోయి శిరః కపాలమును భేదించి.

44. (తాసు నాడీసు సృప్తాః ఆభ్యో నాడీభ్యః ప్రతాయన్తే, తేముష్మిన్నాదిత్యే సృప్తాః అథ తైరేవ రశ్మిభిరూర్ధ్వ మాక్రమతే) ఎన్గిఅపడియే అన్నాడి యోడే సంబంధిత్తు ఆదిత్య రశ్మియై యనుసరిత్తు క్కొండు.

(ఆనాడులయందు ప్రవేశించినవారై యీనాడుల గుండా ప్రవర్తించినవారగుచున్నారనియు, ఆనాడులు యీసూర్యుని యందు ప్రవేశించినవై యుంటున్నవి. గాన వానిద్వారా నా సూర్యరశ్ముల చేత నూర్ధ్వముగా వెళ్ళుచున్నారు) అనుచున్న ప్రకారముగా నా నాడితో సంబంధించి సూర్యరశ్మిని యనుసరించును.

45. (ఓంకారరథమారుహ్య) ఎన్గిఅపడియే ప్రణవమాకిఅ తేరిలే యేఱి మనస్సు సారథ్యం పణ్ణ ప్పోం పోతు.

(ఓంకారమనెడి రథమునెక్కి) అనుచున్నట్లుగా ప్రణవ మనెడి రథమునెక్కి మనస్సు సారథ్యము చేయగా పోయేటప్పుడు.

46. కైయార్ శక్కర త్తి నన్ఱు ఎల్లార్ వడివుమ్ పుతుక్కణిక్కు మాప్పోలే ఉభయ విభూతియుమ్ పుతుక్కణిత్తు.

"కైయార్ శక్కరం" నాడు అందరి శరీరములును నూతన శోభను వహించునట్లువలె నుభయవిభూతులును నూతన శోభను వహించును.

47 కడల్ తన్ గాంభీర్య మెల్లాం కులైన్దు కీఴ్మణ్ కొణ్డు మేల్ మణ్ణెఱిన్దు ససంభ్రమ నృత్తం పణ్ణియార్క.

సముద్రము తన గాంభీర్య మంతయుపోయి, క్రిందనున్న మన్నును పుచ్చుకొని మీదకు విసరివేసి ససంభ్రమనృత్తమూ జేసి, ధ్వని చేయును.

48. ఉపరి తనలోకంగళి లుళ్ళార్కళడైయు, ఉపహారపాణికళాయ్ (నెడువరైత్తోరణమ్ నిరైత్తు) ఆకాశమెఙ్గుం పూర్ణకుంభంగళాలే పూర్ణమాకి.

(ఊర్ధ్వ లోకములయందున్న వారందఱును కానుకలు హస్తములయందుగలవారై (పెద్దపర్వతములవంటి తోరణ స్తంభములను వరుసగానుంచి) ఆకాశమంతటను పూర్ణకుంభములచేపూర్ణముగా చేసి.

49. (తూపనన్మలర్ మఴైపొఴిన్దు) ఇవనొరుకాల్ తఙ్గిప్పోమో ఎన్గిఱనోయాశైయాలే (ఎతిరెతిరిమైయవరిరుప్పిడంవకుక్క

(ధూపముతోకూడా మంచి పుష్పవర్షమును వర్షించి) వీడొక పర్యాయము బసచేసి పోవునాయనెడి దురాశ చేతను (ఎదురెదురుగా దేవతలు వాసస్థానముల నేర్పరతురు).

50. లోకంగళెల్లాం మతికుమ్బడి కడలిరైత్తాప్పోలే వాద్యఙ్గళెఙ్గుం ముఴఙ్గ వఴియిలుళ్ళార్కళడైయ (పోతుమి నెఱితెనమ్ పుకఃతుక) ఎన్గిఱపడియే తఙ్గళ్ స్థానంగళైయుమ్ ఐశ్వర్యయుమ్ సమర్పిక్క.

లోకములన్నియు నదిరేప్రకారముగా సముద్రధ్వని చేసినట్టువలె వాద్యములంతట మోగియగా మార్గమందున్న వారందఱు

(రండి మాస్థానములను ప్రవేశించండి) అనునట్లు తమతమస్థానము లనున్నూ, ఐశ్వర్యములనున్నూ సమర్పింతురు.

51. శిలర్ గీతంగళ్ పాడ, శిలర్ యాగాదిసుకృతఫలంగళై సమర్పిక్క, వేఱేశిలర్ ధూపదీపాదికళాలే యర్చిక్క శిలర్ (కాలజ్గళ్ వలమ్బురి కలన్దెజు) మారవారిప్ప.

కొందఱు గీతములను పాడుదురు., కొందఱు యాగాదిసుకృత ఫలములను సమర్పింతురు. వేరే కొందఱు ధూపదీపాదులచేత నర్చింతురు. కొందఱు (వీరకాహాళములను, దక్షిణావర్త శంఖములను కలసియంతట) ధ్వనింపచేయుదురు.

52. (వాళొణ్కణ్ మడన్దైయరాన) ఆతివాహికమహిషికళ్ ఇతరాజకమాయ్ క్కిడక్క క్కడవతో, ఇత్తైయాళవేణు మెన్ఱు మజ్గళాశాసనమ్ పణ్ణ.

(కాంతిగల సుందరమైన నేత్రములుగల యువతులైన) యాతివాహికుల భార్యలు ఈస్థల మరాజకమై పడియుండవలసినదా ? దీని నేలుకొనవలెనని మంగళాశాసనము చేయుదురు.

53. (మరుతరుం వశుక్కళుమ్) ఇవన్ విరైన్దు పోనాల్ ఈశ్వరన్ నమక్కు కైయడైప్పాక్కిననిల జ్గళిన్దతెన్ఱిరాతే లోకాంతర జ్గళిలు న్దుడర్న్దు శెన్ఱు,

(మరుత్తులును వసువులును) వీడుత్వరపడివెళ్ళిపోగా, సర్వేశ్వరుడు మనకధీనముగా చేసిన స్థలము గడచిపోయినాడని ఊరకుండక లోకాంతరములకు కూడా వెంబడించివెళ్ళి,

54. ఇవన్ శెవిప్పడుమ్బడి స్తోత్రంపణ్ణ (మత్తైలాం కై తొழுప్పోయ్) ఎన్గిఱపడియే పెరియసత్కారత్తోడే పోంపోతు.

వీని చెవిలోపడే ప్రకారముగా స్తోత్రము చేయుదురు. (మిగిలిన వారందఱు నమస్కరించగాపోయి) అనుచున్న ప్రకారముగా పెద్ద సత్కారముతో కూడా పోవునప్పుడు.

55. (అర్చిష మేవా భిసంభవన్తి, అర్చిషోఽహః, అహ్న ఆపూర్యమాణపక్షం, అగ్నిర్జ్యోతి రహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణం) ఎన్ఱు ఛాన్దోగ్య వాజసనేయ కౌషీతకీప్రభృతికళిల్ శొల్లుకిఱపడియే అర్చిరాదిపురుషర్కళ్ వళినడత్తప్పోన్.

ప్రథమ ప్రకరణమ్ సంపూర్ణమ్.

(అర్చిర్లోకమునే పొందుచున్నారు. అర్చిర్లోకమునుండి యహర్లోకమును, అహర్లోకమునుండి శుక్లపక్షలోకమును (అగ్నిర్జ్యోతిరహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణం) అని ఛాందోగ్యవాజసనేయ కౌషీతకీ మొదలగు వాటియందు చెప్పుచున్న ప్రకారముగా నర్చిరాది పురుషులు మార్గమందు నడిపించగా వెళ్లును.

ప్రథమ ప్రకరణము ఆంధ్రానువాదము సంపూర్ణము

ప్రథమ ప్రకరణత్తిల్ ప్రమాణత్తిరట్టు.

భా. శాం. 337. అ. 40 శ్లో

శ్లో॥ ముక్తానాం లక్షణం హ్యేత చ్ఛ్వేతద్వీపనివాసినామ్,
బద్ధాంజలిపుటా హృష్టా నమఇత్యేవ వాదినః॥

ప్రథమ ప్రకరణ మందలి ప్రమాణత్తిరట్టు. తాత్పర్యము.

తా॥ శ్వేతద్వీపమందు నివసించుచున్న ముక్తుల లక్షణమిది, నిత్యమైన అంజలి పుటముగలవారై సంతోషించినవారై "నమః" అనే చెప్పుచున్నవారై యుందురు.

శ్రీ. రా. యు. కా. 36 స. 11 శ్లో॥

శ్లో॥ ద్విధా భజ్యేయ మప్యేవం ననమేయంతు కస్యచిత్
ఏష మే సహజో దోష స్స్వభావో దురతిక్రమః॥

తా। రెండు ప్రక్కలుగా చేసినను ఈవిధముగానే యుందును. ఎవ్వ డికిని వంగేవాడను మాత్రముకాను. ఇది నాకు సహజమైన దోషము. స్వభావము దాటశక్యముకానిది కదా.

భ. గీ. 16 అ. 14 శ్లో॥

శ్లో॥ అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోహ మహం భోగీ సిద్ధోహం బలవాన్ సుఖీ॥

తా॥ ఈశత్రువు నాచేత చంపబడినాడు. మిగిలిన వారలను కూడా చంపెదను. నేను భోగముకలవాడను. నేను సిద్ధుడను. నేను బలవం తుడను. నేను సుఖముకలవాడను.

తి. వా. మొ. 2 ప. 9. తి. 9 పా॥

పా॥ యానే యెన్నై యఱియకిలాతే
యానే యెన్దనతే యెన్ఱిరున్దేన్
యానేనీ యెన్నుడై మైయెయుం నీయే
వానేయేత్తు మెన్ వానవరేఱే॥

తా॥ నేనే నిన్ను తెలిసికొనజాలక 'నేనే' 'నాదే' యని యహం కారమమకారములు గలవాడనై యుంటిని. పరమపదమందున్నవా రందరును స్తోత్రము జేయు మా నిత్యసూరినాయకుడా! నేను నీవే, నాసొత్తుకూడా నీవే॥

తి, వా. మొ. 8 ప. 3 తి, 6 పా.

పా॥ పణియా వమరర్ పణివుం పణ్బుం తానేయాం
అణియారాళ్ళియుం శజ్గము మేన్దు మవర్ కాణ్మిన్
తణియా వెన్నోయులకిల్ తవిర్పాన్, తిరునీల
మణియార్ మేని యోడెన్మనం శూళ్ల వరువారే॥

తా॥ ఇతర దేవతల నాశ్రయింపని నిత్యసూరులు నమస్కరించే స్వభావము కలవారు తామేమైన సౌందర్యముచే పూర్ణమైన చక్రమును శంఖమును ధరించేవారే చూడండీలోకమందు నాశములేని క్రూరమైన వ్యాధులను పోగొట్టుటకొరకు సుందరమై నీలరత్నముతో సమానమైన తిరుమేనితో కూడా నామనస్సు చుట్టుకొనిపోయే టట్లుగా వచ్చుచున్నారు.

తి. వా. మొ. 4 ప. 10 తి. 7 పా.

పా॥ ఓడిఓడి ప్పల్పిఱప్పుమ్ పిఱన్దు మత్తోర్ తెయ్వమ్.
పాడియాడి ప్పణిన్దు పల్పడి కాల్వళ్ళియేఱిక్కణ్డీర్.
కూడి వానవరేత్తనిన్ఱ తిరుక్కురుకూరతనుళ్
ఆడుపుళ్కొడి యాతిమూర్త్తిక్కడిమై ప్పుకువతువే.

తా॥ వేరొక దేవతను పాడి యాడి నమస్కరించియు ననేక ప్రకారములుగా శాస్త్రమార్గముల చేత నాశ్రయించి పరుగెత్తి పరుగెత్తి అనేక జన్మలను జన్మించి చూచితిరి. దేవతలు కూడి స్తోత్రము జేయునట్లుగా తిరునగరియందు వేంచేసియున్నవాడును, ఆడుచున్న గరుత్మంతుని ధ్వజముగా గలవాడును కారణభూతుడైనవాడును నైన సర్వేశ్వరునికి కైంకర్యమును చేయుటకు ప్రవేశించుటయే కర్తవ్యము॥

తి. వా. మొ. 2 ప. 9 తి. 8 పా.

పా॥ ఎక్కాలత్తెన్దైయా యెన్నుళ్ మన్నిల్, మ
త్తెక్కాలత్తిలుం యాతొన్నుమ్ వేణ్డేన్,
మిక్కార్ వేతవిమలర్ విప్రుజ్జుమ్, ఎన్
అక్కారక్కనియై యుడైన్నయానే॥

తా॥ అధికులై వేదప్రతిపాద్యులై నిర్మలులైనవారనుభవించెడి నా చెల్లపుపండువలె భోగ్యమైన నిన్ను నేను సర్వకాలములందును నాకు స్వామియై నా హృదయమందు పొందియున్నట్లైతే మరియేకాలమందునుఏఒకదానినిన్నికోరను.

తి. వా. మొ. 3 ప. 7 తి. 4 పా,

పా॥ ఉడైయార్న్ద వాడైయన్ కణ్డికైయనుడైనాణినన్
పుడైయార్ పొన్నూలినన్ పొన్ముడియన్ మత్తుం
పల్కలన్
నడైయావుడై త్తిరునారణన్ తొణ్డర్ తొణ్డర్ కణ్డీర్
ఇడైయార్ పిఱప్పిడై తోఱెమక్కెమ్బెరుమక్కళే.

తా॥ నడుమునందు పొందియున్న వస్త్రముగలవాడును, కంఠాభరణము గలవాడును, మొలతాడు గలవాడును, ఒకప్రక్కయందు పూర్ణమైయున్న బంగారు యజ్ఞోపవీతము గలవాడును, బంగారు కిరీటము గలవాడును, ఇంకను అనేకాభరణములు స్వభావసిద్ధముగానున్నవాడునునైన శ్రీమన్నారాయణునికి దాసులైనవారికి దాసులైనవారు చూడండీ నిరంతరమైన జన్మావకాశములయందెల్లను మాకసాధారణమైన స్వాములు.

ఇయఱ్పా - 4 అ. 6 పా.

పా॥ అఱియాన్ శమణర్ అయన్ఱార్ పవుత్తర్
శిఱియార్ శివప్పట్టార్ శెప్పిల్ - వెఱియాయ
మాయవనై మాలవనై మాతవనై యేత్తాతార్
ఈనవరే యాతలాలిన్ఱు,

తా॥ క్షపణకులు యెఱుగరు. బౌద్ధులు తెలివిని తప్పినారు. చెప్పితే శైవులు స్వల్పులు, పరిమళముగల యాశ్చర్యభూతుడును, ఆశ్రితుల యందు వ్యామోహము గలవాడునునైన శ్రియఃపతిని స్తోత్రము చేయరు. అగుటచేత నిప్పుడు వారు హీనులే.

తి. వా. మొ. 1 ప తి తి. 1 పా.

పా। ఉయర్వఱ ఉయర్నలముడైయవన్ యవనవన్
మయర్వఱ మతినల మరుళినన్
అయర్వఱు మమరర్కళతిపతి యవనవన్
తుయరఱు శుడరడి తొழுతెழுఎన్మననే॥

తా। ఇతరాతిశయము పోవునట్లుగను వృద్ధిని పొందుచున్న యానందము కలవాడెవడో వాడును, అజ్ఞానముపోవునట్లుగాను భక్తిరూపాపన్న జ్ఞానమును కృపజేసినవాడెవడో వాడును, మరపులేని నిత్యసూరుల కధిపతి యెవడో వాడునునైన సర్వేశ్వరుని యొక్క దుఃఖములను ఛేదించే తేజస్సుగల తిరువడిగళ్ళను నమస్కరించి నామనస్సా! ఉజ్జీవించుము.

తిరుమాలై - 14 పా॥

పా॥ ఎఱియు నీర్ వెఱికొళ్ వేలై మానిలత్తుయర్కళెల్లామ్,
నెఱికొళ్ పూన్దుళవమాలై విణ్ణవర్కోనై యేత్త

అఱివిలా మనిశరెల్లా మరఙ్గమెన్ఱళైప్పరాకిల్,
పొఱియిల్ వాళ్ నరకమెల్లామ్ పుల్లెళున్దొళిన్దవన్ఱే॥

తా॥ తరంగించుచున్న నీరును పరిమళమునుగల సముద్రముచే చుట్టు వారఁబడిన మహాపృథివియందున్న చేతను లందరును పరిమళము గల సుందరమైన తిరుత్తుళాయ్ మాలికగల నిత్యసూరి నాయకుని స్తోత్రము జేయుటకు జ్ఞానములేని మనుష్యులందరును శ్రీరంగము అని చెప్పేవారైతే యింద్రియములయందు వర్తించే నరకమంత యును గడ్డిమొలచి పోవునుకదా.

తి. వా. మొ. 2 ప. 3 తి. 10 పా.

పా॥ కళిప్పుం కవర్వుమత్తు ప్పిఱప్పు ప్పిణి మూప్పిఱప్పత్తు
ఒళిక్కొణ్డ శోతియుమా యుడన్ కూడువ తెన్ఱుకొలో
తుళిక్కిన్ఱవానిన్నిలం శుడరాళిశఙ్గేన్ది
అళిక్కిన్ఱ మాయప్పిరా నడియార్కళ్ కుళాఙ్గళై యే॥

తా॥ సంతోషము క్లేశముపోయి, జన్మ, వ్యాధి, ముసలితనము, మర ణముపోయి నిరవధిక తేజోరూపమైన శరీరముగలవారమై వర్షించు చున్న ఆకాశమును యీ భూమిని కాంతిగల చక్రమును శంఖమును ధరించి రక్షించుచున్న ఆశ్చర్యభూతుడైన ఉపకారకుడైన శ్రియః పతియొక్క దాసులైన నిత్యసూరులయొక్క సమూహములను కూడా కూడునదెప్పుడో॥

తి. వి. 1 పా.

పా॥ పొయ్న్నిన్ఱఞానముం పొల్లావొళుక్కు మళుక్కుడమ్బుమ్
ఇన్నిన్ఱనీర్మై యినియామురామై - ఉయిరళిప్పా
నెన్నిన్ఱయోనియుమాయ్ పిఱన్దా యిమైయోర్ తలైవా
మెయ్న్నినుకేట్టరుళాయ్-అడియేన్ శెయ్యుం విణ్ణప్పమే॥

తి. వి. 1 పా.

తా॥ అసత్యశబ్దవాచ్యమైన దేహమందాత్మయనెడి జ్ఞానమును, దుష్టమైనకర్మప్రవాహమును హేయమైన శరీరమును ఈ విధముగానున్న స్వభావమును యికను చేము పొందకుండా ఆత్మలను రక్షించుటకొరకు సకల విధములైన జన్మలయందు పుట్టినవాడా! నిత్యసూరి నాయకుడా! దాసుడనైన నేను చేసెడి సత్యమైన విన్నపమును నిలచి విని కృపజేయుము.

ఋగ్వేదే.

ఋక్. తద్విష్ణోః పరమంపదం సదా పశ్యంతి సూరయః
దివీవ చక్షురాతతం తద్విప్రాసో విపన్యవో జాగృవాంస
స్సమిన్ధతే. విష్ణో ర్యత్పరమం పదమ్.

తా॥ ప్రసిద్ధమైన ఆవిష్ణువుయొక్క పరమపదమును (ఉత్కృష్టస్థానమును) నిత్యసూరులు ఎల్లప్పుడును అంతరిక్షమందు వ్యాపృతమైన చక్షువులతో చూచుచుందురు. ఆవిష్ణువు యొక్క పరమపదమందు మేధావులు స్తుతిశీలులు జాగరూకులునునైన నిత్యసూరులు అధికముగా ప్రకాశించుచున్నారు.

తి. వా. మొ. 2 ప. 6 తి 3 పా.

పా॥ తామరై క్కణ్ణనై విణ్ణోర్ పరవున్దలైమకనై, తుళ్ళాయ్విరై
ప్పూమడవుకణ్ణి యెమ్బిరానై ప్పొన్మలైయై
నామడువి నన్నేత్తి యుళ్ళివణజ్గీ నామకిళ్ళన్దాడ. నావలర్
పామరువినిఱ్క త్తన్ద పాన్మైయే వళ్ళలే.

తా॥ తామరపువ్వులవంటి నేత్రములు గలవాడును. నిత్యసూరులు స్తోత్రముజేయు ప్రధానుడును. పరిమళము పువ్వులు అమరి

యున్న తిరుత్తుళ్ళాయ్ మాలికగల మాస్వామియును బంగారు పర్వతము వంటివాడునునైన తనను మనము సమీపించి చక్కగా స్తోత్రముజేసి ధ్యానించి నమస్కరించి మనము సంతోషించి యాడేటట్టుగా నాలుకయందు వికసించుచున్న పాశురములు యమరియుండేటట్టుగా యిచ్చిన స్వభావమునకు తగిన ఔదార్యము గలవాడా :

పె. తి. మొ. 1 ప. 1 తి. 7 పా.

పా॥ ఇప్పేఅప్పటియా రివరవరెన్ని రిన్నతోర్ తన్నైమ్మయెన్నుణరీర్
కల్పకమ్ పులవర్ కళైకణె న్నులకిల్ కణ్డవా తొణ్డరై ప్పాడుమ్
శొల్ప్పొరుళాళ్ళిర్ శొల్లుకేన్ తమ్మిన్ శూళ్పునల్
కుడన్దైయే తొళ్ళుమిన్
నల్ప్పొరుళ్ కాణ్మిన్ పాడి నీరుయ్మిన్ నారాయణా
వెన్నుమ్ నామమ్.

తా॥ ఇంటిని జన్మను యెరుగరు. వీరువారనరు ఇట్టిదొకస్వభావమని యెరుగరు. కల్పవృక్షము వంటివారు, కవులకు రక్షకులు అని లోకమందు నీచులను చూచిన విధముగా పాడెడి శబ్దములను అర్థములను యేలుకొన్న వారలారా! రండు చెప్పుచున్నాను. జలము చేత చుట్టువారు కొనబడిన తిరుక్కుడన్దైనే సేవించండి. నారాయణా యనెడి నామమును పాడియుజ్జీవించండి. మంచి యర్థము చూడండీ.

తిరుప్పావై - 29 పా.

పా॥ శిత్తం శిఱుకాలే వన్దున్నై చ్చేవిత్తున్
పొత్తామరై యడియే పోత్తుంపొరుళ్ కేళాయ్.
పెత్తం మేయ్త్తుణ్ణుం కులత్తినిల్ పిఱన్దు నీ
కుత్తేవలెజ్గళై క్కొళ్ళామ ఱ్పోకాతు.

ఇత్తై ప్పఱైక్కొళ్వా న్నన్ఱుకాణ్ కోవిన్దా
ఎత్తైక్కు మేழ్ఏழ్ప్పిఱవిక్కు మున్దన్నోడు
ఉత్తోమే యావో మునక్కే నామాళ్చెయ్ వోమ్
మత్తైనఙామఙ్గళ్ మాత్తేలో రెమ్బావాయ్.

తా॥ మిక్కిలిప్రాతః కాలమందే వచ్చి నిన్ను సేవించి నీ సుందర మైన తామరపుష్పములవంటి తిరువడికళ్ళనే స్తోత్రము జేసేయర్థ మును వినుము. పశువులను మేపించి భుజించెడి కులమందు పుట్టి నీవు మమ్ముల నంతరంగ కైంకర్యమందు స్వీకరించకుండా పోదు. ఇప్పుడు తప్పిడి గుళ్ళను స్వీకరించుటకొరకు కాదు చూడుమా. గోవిందా ఎప్పటికిన్నీ యేడేడుజన్మలకున్నూ నీతో సంబంధము కలవారమే యయ్యెదము. నీకే మేముదాస్యము చేసెదము. ఇతరమైన మాకోరి కలను పోగొట్టుము. ఏలుకొనుము. ఆలోచించుము. మావ్రతము.

తిరుమాలై - 27 పా.

పా॥ కురఙ్గుకళ్ మలైయై నూక్కక్ కుళిత్తుత్ తామ్పురట్టిట్టోడి
తరఙ్గనీరడైక్క లుత్త శలమిలావణిలు మ్పోలేన్
మరఙ్గళ్ పోల్ వలియనెఞ్జమ్ వఞ్జనేన్ నెఞ్జుతన్నాల్
అరఙ్గనార్క్కాట్చెయ్యాతే యళియత్తే నయర్కిన్ఱేనే.

తా॥ వానరులు పర్వతములను తోసి వేయగా తాము మునిగి యిసుకలో పొర్లి పరుగెత్తి వెళ్ళి తరంగములుగల సముద్రమును బంధించుట కుద్యమించిన కపటములేని యుడుతలను పోలను. వృక్ష ములువలె కఠినమైన మనస్సుగల వంచకుడను దయనీయుడనునైన నేను శ్రీరంగనాథునకు మనస్సు చేత దాస్యము చేయక మరచు చున్నాను.

పెరు. తి. మొ. 3 తి. 3 పా.

పా॥ మారనార్ వరివెజ్జులైక్కాట్చెయ్యుమ్
పారినారోడుమ్ కూడువతిల్లైయాన్
ఆరమార్వ్ నరజ్ఞ నన్దన్. నల్
నారణన్ నరకాన్దకన్ పిత్తనే,

తా॥ మన్మథుని సుందరమై కూరమైయున్న ధనుస్సునకు దాస్యము జేయు లోకులతో నేనుకూడునది లేదు. హారము వక్షస్థలమందు గలవాడును. అపరిచ్ఛేద్యమైన స్వరూపము గలవాడును సర్వస్వామి యును నరకాంతకుడునునగు శ్రీరంగనాథుని విషయమందు పిచ్చి వాడను.

తి. వా. మొ. 4 ప. 10 తి 11 పా.

పా॥ ఆట్చెయ్ తాళ్పిరానై చ్చేర్న్దవన్ వణ్గుకూర్ నకరాన్
నాట్కమళ్ మకిళ్మాలై మార్పినన్ మాఱన్ శడకోపన్
వేట్కైయా ల్సొన్నపాడలాయిరత్తుళ్ళిప్పత్తుం వల్లార్
మీట్చియిన్ఱి వైకున్దమానకర్ మత్తతు కైయతువే॥

తా॥ వాచికకైంకర్యమును జేసి చక్రమును ధరించిన యుపకారకుని యాశ్రయించిన వారును సుందరమైన తిరునగరికి నిర్వాహకులును, నూతనముగా పరిమళించుచున్న వకుళమాలిక వక్షస్థలమందు గల వారును. మాఱులనెడి తిరునామముగల నమ్మాళ్వార్ల అభినివేశ ముతో నాయించిన పాశురములైన వెయ్యింటియందును యీపది పాశురములను నభ్యసించ సమర్థులైన వారియొక్క చేతిలోని వే పునరావృత్తిలేని పరమపదము మిగిలిన లీలావిభూతియును.

## తిరుమాలై - 5 పా.

పా॥ పెణ్డిరాల్ సుకఙ్గళుయ్ ప్పాన్ పెరియతోరిడుమ్బై పూణ్డు
ఉణ్డిరాక్కిడక్కుంపోతు ముడలుక్కే కరైన్దునైన్దు
తణ్డుఴాయ్ మాలై మార్పన్ తమర్కళాయ్ ప్పాడియాడి
తొణ్డుపూణ్డముతముణ్ణా త్తొఴుమ్బర్ శోఱుకక్కుమాఱే.

తా॥ భార్యలచేత సుఖముల ననుభవింపగోరి పెద్ద దుఃఖములను పైగొని రాత్రి భుజించి పడుకొనేటప్పుడు శరీరమునకే కరగిశిథిలమై చల్లని తిరుత్తుళాయ్ మాలిక వక్షస్థలమందుగల సర్వేశ్వరునికి దాసులై పాడియాడి దాస్యమునుపైగొని గుణానుభవమనెడి యమృతమును భుజించని నీచులన్నమునాదరించే ప్రకారమేమియాశ్చర్యము.

## పె. తి. మొ. 1 ప. 3 తి. 5 పా.

పా॥ పణ్డుకామరానవాఱుమ్ పావైయర్ వాయముత
ముణ్డవాఱుమ్ వాఴ్న్దవాఱు మొక్కవురై త్తిరుమి
తణ్డుకాలాయూన్ఱియూన్ఱి తళ్ళినడవా మున్
వణ్డుపాడుమ్ తణ్డుఴాయాన్ వతరి వణఙ్గుతుమే.

తా॥ పూర్వము కాముకులైన ప్రకారమునున్నూ స్త్రీలయొక్క యధరామృతమును భుజించిన ప్రకారమునున్నూ సుఖించిన ప్రకారమునున్నూ సమానముగా చెప్పి దగ్గి కర్రను కాలుగా ఊనుకొని తోసుకొనిపోవుచు నడవకమునుపే తుమ్మెదలు పాడెడి చల్లని తిరుత్తుళాయ్ ధరించిన స్వామియొక్క బదరియనెడి దివ్యదేశమును సేవించుదము.

ఛాం. 7 ప్ర. 26 ఖం. 2 మం.

మం॥ స ఏకధా భవతి త్రిధా భవతి పంచధా సప్తధా నవధా చైవ పునశ్చైకాదశ స్మృతః శతంచ దశచైకశ్చ సహస్రాణిచ వింశతిః.

తా॥ ఆబ్రహ్మదర్శి ఒకవిధముగా నగుచున్నాడు. మూడు విధములుగా నగుచున్నాడు. ఐదు విధములుగానున్నూ తిరిగీ పదకొండు విధములుగానున్నూ అగుచున్నాడని చెప్పబడినాడు. నూరున్నూ పదిన్నీ ఒకటిన్నీ వేయిన్నీ యిరువదిన్నీ శరీరములు గల వాడగుచున్నాడు.

పె. తి. మొ. 1 ప. 9 తి. 4 పా.

పా॥ కులన్దా నెత్తనై యుం పిఱన్దే యిఱన్దెయ్ త్తొళ్లిన్దేన్
నలన్దా నొన్రుమిలేన్ నల్లతోర అమ్ శెయ్ తుమిలేన్
నిలన్దోయ్ నీళ్ ముకిల్ శేర్ నెఱియార్ తిరువేఙ్గడవా
అలన్దేన్ వన్దడైన్దే నడియేనై యాట్కొణ్డరుళే॥

తా॥ భూమిని స్పృశించుచున్న గొప్ప మేఘములుగల మార్గములచే నిండీయున్న తిరువేంగడమందు వేంచేసియున్న స్వామీః ఎన్నో కులములయందు పుట్టియే మరణించియే శ్రమపడిపోతిని. మంచియొకటియును లేనివాడను. మంచియొక ధర్మమును చేసియును లేను. క్లేశించితిని. వచ్చి యాశ్రయించితిని. దాసుని దాస్యమందు స్వీకరించి కృపజేయుము.

తి. వా. మొ. 8 ప. 3 తి. 7 పా.

పా॥ వరువార్ శెల్వార్ వణ్బరిశార త్తిరున్దు ఎ
న్దిరువాழ்మార్వ ఱ్కెన్దిఱమ్ శొల్లార్ శెయ్ తెన్

ఉరువార్ శక్కరజ్ఞాజ్ఞ జ్ఞమన్డ్గిమోన్స్ర‌మం.
ఒరుపాడుఘ్రల్వా నోరడియాను ముళనన్ఱే.

తా॥ వచ్చువారు వెళ్ళువారు సుందరమైన తిరుప్పరిశారమందున్న మాయొక్క లక్ష్మీదేవి నిత్యవాసము జేయుచున్న వక్షస్థలముగల స్వామికి సౌందర్యముచే పూర్ణమైన చక్రమును శంఖమును మోసుకొని ఇక్కడ మీతో కూడా నొకపార్శ్వమందు సంచరించెడి ఒక దాసుడుకూడా నున్నాడని విషయమును చెప్పరు. చేసేదేమి;

తి. వా. మొ. 3 వ. 2 తి. 1 పా

పా॥ మున్నీర్ ఞాలమ్పడైత్త వెమ్ముకిల్ వణ్ణనే
యన్నాళ్ నీతన్ద వాక్కైయిన్ వళ్ళియుళ్ళ ల్వేన్
వెన్నాణోయ్ వీయ విన్రైకళై వేరఱ ప్పాయ్న్దు
ఎన్నాళ్ యానున్నై యినివన్దు కూడువనే.

డా॥ మూడు విధములైన జలముగల సముద్రమందు లోకమును సృజించిన నామేఘమువంటి వర్ణము గలవాడా; ఆనాడు నీవుయిచ్చిన శరీరమార్గమందు సంచరించుచున్న నేను కూరమైన దినములయందలి వ్యాధులు నశించునట్లు పాపములను వేరు తెగునట్లుగా పారదోలి నేనునిన్ను యికను వచ్చి ఎప్పుడు కూడెదను.

రా. యు. 18 స. 34 శ్లో.

శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే.
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ॥

తా॥ నీకు శేషభూతుడనైతినని యాచించుచున్నవాడై ఒకపర్యాయమే ప్రపత్తిచేసిన వానికొరకు సమస్తభూతములనుండి యభయము నిచ్చెదను. ఇది నాయొక్క వ్రతము.

తి. వి. 95 పా.

పా॥ యాతానుమోరాక్కైయిఱ్ఱుక్క అజ్గాప్పాజ్ఞ మాప్పవిత్తున్దమ్
మాతావియిల్ తడుమాఱు ముయిర్మున్నమే అతనాల్
యాతానుమ్ పత్తి నీజ్గుమ్ విరతత్తై నన్తీడు శెయ్యుమ్
మాతావినై ప్పితువై తిరుమాలై వణజ్గువనే.

తా॥ ఆత్మ మునుపేయేదైన నొకదేహమందు ప్రవేశించి యక్కడకట్టబడినన్ని కట్టువిడిపించుకొనిన్ని పాచీనమైన సూక్ష్మశరీరమందు (మూలప్రకృతియందు) తల్లడపాటును చెందును. దానిచేత యేదానినైననుపట్టి భగవద్విషయమును విడచే వ్రతమును చక్కగా విడిపించెడి తల్లివంటివాడును తండ్రివంటివాడునునైన శ్రియఃపతినియాశ్రయింతును.

పె. తి. మొ. 1 ప. 1 తి. 1 పా.

పా॥ వాడినేన్ వాడివరున్దినేన్ మనత్తాల్ పెరున్దుయరిడుమ్బైయిల్పిఱన్దు
కూడినేన్ కూడి యిళైయవర్ తమ్మోడవర్తరు కలవియే కరుతి.
ఓడినేనోడి యుయ్ వతోర్ పొరుళా లుణర్వెనుమ్ పెరుమ్బతమ్ తెరిన్దు.

నాడినేన్ నాడినాన్ కణ్డుకొణ్డేన్ నారాయణా వెన్నుమ్ నామమ్

తా॥ గొప్ప దుఃఖములకు స్థానమై దుఃఖములకు హేతువైన శరీరమందు పుట్టికూడితిని. కూడి యువతులతో వారఱయిచ్చెడి సంశ్లేషమునే తలంచుచు పరుగెత్తితిని. పరుగెత్తి మనస్సుచేత శ్రమపడితిని.

వాడితిని. వాడి యుజ్జీవించెడి ఒక అర్థముచేత జ్ఞానమనెడి పెద్ద పద విని తెలుసుకొని విచారించితిని. విచారించి నేను నారాయణాయనెడి నామమును కనుగొంటిని.

తి. నె. దా. 6 పా.

పా॥ అలమ్బురిన్ద నెడున్దడక్కై యమరర్ వేన్దన్
అఙ్ఞైత్తెప్పళ్ తనిప్పాకనవుణర్ క్కెన్తుమ్
శలమ్బురిన్ద జ్గరుళిల్లా త్తన్మైయాళన్
తానుకన్దవూరెల్లామ్ తన్దాళ్ పాడి
నిలమ్బరన్దు వరుజ్గలుళ్ళి ప్పెణ్ణైయార్ త్త
నెడువేయ్ కళ్ పడుము త్తమున్ద వున్ది
పులమ్బరన్దు పాన్ విళైక్కుమ్ పొయ్ కై వేలి
పూఞ్గోవలూర్ తొழுతుమ్ పోతు నెఞ్జే.

తా॥ చాలునంతవరకు నిచ్చెడి పొడవై విశాలమైన హస్తముగల వాడును నిత్యసూరి నిర్వాహకుడును సుందరమైన రెక్కలుగల గరుత్మంతుని కద్వితీయమైన సారథియైనవాడును రాక్షసుల కెప్పుడును కోపమునుచేసి వారి విషయములో కృపలేని స్వభావము గలవాడును నైన సర్వేశ్వరుడు తాను సంతోషించిన దివ్యదేశములయందింతటను తన తిరువడికళ్ళనుపాడి భూమియందు వ్యాపించి వచ్చెడి కలుషమైన పెన్నానది యీడ్చుకొని వచ్చిన పొడవైన వెదుళ్ళనుండిపడిన ముత్యములను తోసివేయగా తోసివేయబడి పొలములయందు వ్యాపించి బంగారమును ఫలించే చెరువులు వెలుగుగాగల సుందరమైన తిరుకోవలూరును సేవింతము మనస్సా, రమ్ము.

తి. వా. మొ. 3 ప. 2 తి. 6 పా.

పా॥ కిఱ్పన్ కిల్లే నెన్గిలన్ ముననాళాల్
అఱ్పశారజ్గ ళవై శువై త్తకన్ఱొழிన్దేన్

పఱ్ఱల్లాయిరము ముయిర్ శెయ్త పరమా నిన్
నఱ్ఱొచ్చోతిత్తాళ్ నణుకువ తెజ్ఞాన్ఱే.

తా॥ పూర్వకాలమంతయు సమర్థుడను సమర్థుడను కాను అని ఉండలేదు. అల్పసారములైన యాశబ్దాది విషయముల ననుభవించి దూరమై విడచితిని. అనేక విధములైన యసంఖ్యాతములైన ప్రాణులను సృజించిన సర్వాధికుడా! నీ శ్రేష్ఠములై సుందరమై తేజోమయమైన తిరువడికళ్ళను సమీపించునదెప్పుడో.

తి. వా. మొ. 2 ప. 7 తి. 6 పా.

పా॥ మతుశూతన్నై యన్ఱి మత్తిలే నెన్ఱెత్తాలు జ్గరుమ మిన్ఱి
తుతిశూఴ్న్దపాడల్ కళ్ పాడి యాడ నిన్ఱూఴియూఴి
తొఴుమ్.
ఎతిర్ శూఴ్ల్ పుక్కు నై తోర్పిఱప్పు మెనక్కే యరుళ్ కళ్
శెయ్య
వితిశూఴ్న్దతా లెనక్కేలమ్మా న్తిరివిక్కిరమన్నై యే.

తా॥ మధుసూదనుని తప్ప వేఱు ప్రాప్యము లేని వాడని ఏవస్తువు చేతను కార్యము లేక స్తోత్రములచే వ్యాప్తమైన పాశురములను స్థిరముగానుండి పాడియాడునట్లు ప్రతికల్పమందును యనేకములై యద్వితీయములైన జన్మలయందెదురుగాను చుట్టు ప్రవేశించి నాకే కటాక్షములను జేయుటకు నాకే తగిన హేతువులుగల స్వామియైన త్రివిక్రముని కృప చుట్టుకొనినది.

తి. వా. మొ. 5 ప. 7 తి. 5 పా.

పా॥ ఎయ్త కూఱ్ఱువతలావతే యెనక్కెవ్వ తెవ్వత్తుళాయు
మాయ్ నిన్ఱు.

కైతవఙ్గళ్ శెయ్యు ఙ్గరుమేని యమ్మానే
శెయ్తవేళ్వియర్ వైయ త్తేవరఱా చ్చిరీవరమఙ్గలనకర్
కైతొఴువిఱన్దాయ్ అతు నానుఙ్గణ్డేనే.

తా॥ నాకు పొందుటకు పిలచుటయను రూపమగునా; ఎటువంటి శత్రువులయందును కలసియుండి కృత్రిమములను జేయు నల్లని తిరు మేనిగల స్వామీ! చేయబడిన యజ్ఞములుగలవారైన భూసురులు నిరంతరముగా వాసముజేయుచున్న శిరీవరమంగలనగరియందు (వానమామలయందు) ఉన్నవారలు నమస్కరించేటట్లుగా వేంచేసి యుంటివి. దానిని నేనును చూచితిని.

పె. తి. మొ. 11 ప. 8 తి. 4 పా.

ఉరువార్ పిఱవి క్కళిన్నుక్కప్పెయ్తు
తిరివాయెను శిన్దిత్తి యెన్దతఱ్కఞ్జి.
ఇరుపాడెరికొళ్ళియినుళ్ళెఱుమ్బేపోల్
ఉరుకానిఱ్కు మెన్నుళ్ళమూఴిముతల్వా॥

తా॥ కాలోపలక్షిత సకలపదార్థములకు కారణమైనవాడా: నానా రూపములైన జన్మలయందింకను ప్రవేశింపజేసి తిరిగెదవని తలంచితి వని దానికి భయపడి రెండుప్రక్కలను ప్రజ్వలించుచున్న కొరకంచు నందున్న చీమవలె నామనస్సు కరుగుచుండును.

తి. వా. మొ. 5 ప. 1 తి 9 పా.

పా॥ ఆవారార్ తుణై యెన్ఱలైనీర్క్కడలుళ్ఴున్దుమ్
నావాయ్ పోల్ పిఱవిక్కడలుణిన్ఱు నాన్తుళఙ్గ
త్తేవార్కోలత్తొడుమ్ తిరుచ్చక్కరమ్ శఙ్గినొడుమ్
ఆవావెన్ఱరుళ్ శెయ్తడియే నొడుమానానే.

తా॥ సహాయమయేవారెవరు ? అని తరంగించుచున్న జలముగల సముద్రమందు మునిగిపోవుచున్న నావవలె సంసార సముద్ర మందుండి నేను వణకుచుండగా సౌందర్యముచే పూర్ణమైన దివ్యవిగ్రహము తోడను చక్రము శంఖముతోడను అయ్యో అయ్యో అని కృప జేసి దాసునితో కూడా కలసినాడు.

పె. తి. మొ. 11 ప. 8 తి. 2 పా.

పా॥ శీత్తముళ వాకిలుఞ్జెప్పువన్ మక్కళ్
తోత్తుక్కుళ్ళితోత్తువిప్పాయ్ కొలెన్రిఞ్ఞె.
కాత్తత్తిడై ప్పట్ట కలవర్ మనమ్పోల్
ఆత్తతుళజ్ఞానిజ్ఞు వాళ్ళివలవా.

తా॥ చక్రము దక్షిణహస్తమందు గలవాడా; కోపముగలదు. అయినను చెప్పెదను. మనుష్యులు పుట్టెగుంటయందు పుట్టించెదవే మోయని భయపడి గాలిమధ్యను పడిన ఓడయందున్నవారి మనస్సువలె మిక్కిలి తల్లడించుచుండును.

తి. వా. మొ. 6 ప. 9 తి. 9 పా.

పా॥ ఆవి తికైక్క వైవర్ కునైకుక్క ఞ్జిత్తిన్నమ్.
పావియేనై ప్పల నీ కాట్టి ప్పడుప్పాయో.
తావి వైయజ్గొణ్ణ తడన్దామరై కళ్కె
కూవికొళ్ళుఞ్జాల మిన్నమ్ గులుకాతో.

తా॥ మనస్సు దిగ్భ్రమను చెందేటట్టుగా పంచేంద్రియములు బాధించే స్వల్పమైన సుఖములనేకములను కనపరచి నీవు పాపాత్ముడనైన నన్ను బాధను పెట్టెదవా ? భూమినికొలచి స్వీకరించిన

విశాలమైన తామరపుష్పములవంటి తిరువడికళ్ళవద్దకే పిలుచుకొనే కాలమింకను సమీపించదా ?

తి. వా. మొ. 6 ప. 9 తి. 8 పా.

పా॥ అఱివిలేనుక్కుఱుళా యఱివారుయిరానాయ్
వెఱికొళ్ శోతిమూర్తియడియేన్ నెడుమాలే.
కెఱిశెయ్ తెన్నైప్పుఱత్తిట్టిన్నం కెడుప్పాయో.
పిఱితోన్ఱటియాన వడియే నావిత్తెక్కవే.

తా॥ జ్ఞానులను ఆత్మగా కలవాడా! పరిమళించుచున్న తేజోమయమైన విగ్రహము గలవాడవై దాసునియందు గొప్ప వ్యామోహము గలవాడా! జ్ఞానహీనుడనైన నాకు కృపజేయుమా. నిన్ను తప్ప వేఱొకవుపాయము నెఱుగని దాసుని మనస్సు భ్రమించునట్లు వుపాయమును జేసి నన్ను బాహ్యవిషయములయందు పెట్టి యింకను చెడగొట్టెదవా ?

తి. వా. మొ. 7 ప. 1 తి. 10 పా.

పా॥ ఎన్బరక్షుడరే యెన్ఱున్నైయలత్తి యున్నికైత్తామరైక
ట్కన్బురుకి నిఱ్కుమతునిఱ్క చ్చుమడుతన్దాయ్
వన్బరక్షళెదుత్తైవర్ తిశైతిశై వలిత్తెత్తుకిన్ఱనర్
మున్బరవై కడైన్దముతఙ్గొణ్డమూర్తియో.

తా॥ పూర్వము సముద్రమును తరచి యమృతమును స్వీకరించిన ఓ స్వామీ! నాపరంజ్యోతి స్వరూపుడా! అని నిన్నుగురించి మొఱబెట్టి నీజోడైన పాద పద్మముల విషయమైన ప్రేమచే కరగియుండదగిన యాభాగ్యముండగా భారము నిచ్చితివి. క్రూరమైన భారములనెత్తి పంచేంద్రియములు ప్రతిదిక్కునకు లాగి కుదవేయుచున్నారు. అయ్యో.

పె. తి. మొ. 7 ప 7 తి. 9 పా.

పా॥ కోవాయ్యైవరెన్నైయ్ కుడియేఱి క్కూత్తెశోఱివై తా వెన్ఱుమెత్తు
ప్పోకార్; నానవరై ప్పాలుక్కుకిల్లేన్ పునితా పుట్కొడియాయ్
నెడుమాలే.
తీవాయ్ నాకణై యిత్తుయిల్వానే తిరుమాలేయినిచ్చెయ్
వతొన్ఱఱియేన్
ఆవా వెన్ఱడియేఱ్కిత్తై యిరఙ్గాయ్ తిరుణ్దూర్ మేత్తి శైనిన్ఱ
వమ్మానే.

తా॥ పరిశుద్ధుడా! గరుడధ్వజుడా! గొప్పవ్యామోహము గల
వాడా! అగ్నినిక్రక్కుచున్న నోరుగల తిరువనన్దాళ్వాననే పర్యంక
మందు నిద్రించినవాడా! శ్రియః పతీ! తిరువళున్దూరుయందు పశ్చి
మదిక్కున వేంచేసియున్న స్వామీ! పంచేంద్రియములు రాజులై
నాశరీరమందు కాపురముండి వస్త్రము అన్నము అయిన వీటిని తేయని
బాధించిపోరు. నేను వారిని సహించజాలను. ఇకను చేయునదేది
యును ఎరుగను. అయ్యో అయ్యో అని దాసునకు కొంచెము కనిక
రించుము.

తి. వా. మొ. 4 ప. 9 తి. 1 పా.

పా॥ నణ్ణాతార్ ముఱువలిప్పనల్లుత్తార్ కరైన్దేఙ్గ
వెణ్ణారాత్తుయర్ విళైక్కుమివై యెన్నవులకియత్కె
కణ్ణాళా! కడల్ కడైన్దాయునకళల్కే వరుమ్బరిశు
తణ్ణావాతడియేనై ప్పణికణ్డాయ్ శామాఱే.

తా॥ శత్రువులు సంతోషించునట్లును, మంచి స్నేహముగల బంధు
వులు కరగియేడ్చునట్లుగాను అసంఖ్యాకమైన దుఃఖములను కలుగ

జేసెడియిది ఏమి లోకస్వభావము; దయగలవాడా! సముద్రమును తరచిన వాడా! నీతిరువడికళ్ళవద్దకే వచ్చునట్లుగా నాలస్యము చేయక దాసుని మరణించే ప్రకారమును సాయించుమా.

తి. వా. మొ- 4 ప 9 తి. 3 పా.

పా॥ కొణ్డాట్టుం క్కులమ్పునైవుదమరుత్తార్ విఱ్ఱునితియుమ్.
వణ్డార్ పూఙ్గుళలాళుమ్ మన్నైయుమ్ళియ వుయిర్ మాయ్ త
అణ్డాత్తే నులకియఱ్కై కడల్వణ్ణా వడియేనై
పణ్డే పోల్ కరుతాతున్నడిక్కే కూవి ప్పణికొళ్ళే.

తా॥ కొనియాడుటయును, కులము నలంకరించుటయును జ్ఞాతులుం బంధువులు శ్లాఘ్యమైన నిధియును, భ్రమరములచే పూర్ణమైన పుష్పములు కొప్పుయందుగల భార్యను విడచి ప్రాణము నశించుట యునునగు లోకస్వభావమును చూచి సహించజాలను. సముద్రము వంటి వర్ణము గలవాడా! దాసుడనైన నన్ను పూర్వమువలె తలంపక నీతిరువడికళ్ళవద్దకే బిలిచి కైంకర్యమును స్వీకరింపుము.

తిరువాశిరియం 6 పా.

పా॥ ఓ ఓ వులకినతియల్పే ఈన్ఱోళిరుక్కై మఱ్ఱై నీరాట్టి
పడైత్తిడన్దుణ్డుమిళ్ంన్దళన్దు తేర్న్దులకళిక్కుమ్ ముతల్వ
రుక్కడవుళ్ నిఱ్ప పుడైప్పలతానఱి తెయ్వమ్ పేణుతల్
తనాతు పుల్లఱివాణ్మై పొరున్దక్కాట్టి, కొల్వన ముతలావల్లన
ముయలుమ్ ఇనైయశెయ్కై యిన్పుతున్పళి.
తొన్నామాయ ప్పిఱవియుళ్ నీఙ్గా పన్నామాయత్తరున్దు
మానళిన్దే.

తా॥ లోకములను సృజించి, పట్టువిడిపించి, భుజించి, ఉమ్మివేసి, కొలచుకొని, ఆలోచించి, రక్షించెడి కారణభూతుడై పరదేవతయైన శ్రీమన్నారాయణుడుండగా, పాపితములయందలి యనేక విధములైన తానెఱిగిన దేవతల నాదరించుట తన క్షుద్రమైన బుద్ధిని పెద్దల మనస్సునందు పడునట్లు కనపరచి కన్న తల్లి యుండగా పీట చెక్కను స్నానమాడించినట్లున్నది (ఆదేవతలయొక్క) కృత్యము హింస మొదలగు నిషిద్ధకర్మలను యత్నించుట యనెడి యిట్టిది. ఫలము దుఃఖముతో కూడిన సుఖము. అనాదియై గొప్పదై యాశ్చర్యకరమైన సంసారమునుండి యెడబాయకుండా యనేకవిధములైన గొప్పవైన మోహజనకములైన శబ్దాది విషయములయందు చక్కగా (చల్లగా) మునిగియుండుటకు హేతుపగును. లోకము యొక్క స్వభావ మేమి యాశ్చర్యము.

పెరు. తి మొ. 3 తి. 8 పా.

పా॥ పేయరే యెనక్కు యావరుమ్ యానుమోర్
పేయనే యెవర్క్కు మితు పేశి యెన్.
ఆయనే యరఙ్గా వెన్ఱు అళైక్కిన్ఱేన్
పేయనాయొళిన్దేన్ ఎమ్పిరానుక్కే.

తా॥ అందరును నాకు పిచ్చివారే. నేనును అందరికి నొక పిచ్చివాడను. ఇదిచెప్పి ప్రయోజన మేమి ? గొల్లవాడా! శ్రీరంగనాథుడా అని మొరపెట్టుచున్నాను. నాకుపకారకుడైన పెరియపెరుమాళ్ విషయమందు పిచ్చివాడనై విడచితిని.

పెరి. తి. మొ. 5 ప. 1 తి. 5 పా

పా॥ తోట్టమిల్లవళాత్తొళ్ళాదైత్తుడవై యుమ్ కిణఱుమివై యెల్లాం
వాట్టమిన్ఱి యున్ పొన్నడిక్కీళ్ వళై ప్పకమ్ వకుత్తుక్కొణ్డిరున్దేన్

నాట్టు మానిడత్తో డెనక్కు౽ఱితు నచ్చువార్ పలర్ కేళ్లులొన్దాకి
క్కోట్టుమణ్ కొణ్డ కోళ్ కై నానే, కుజ్ఞరమ్ వీళ్ల కొమ్బొ

శిత్తానే॥

తా॥ అద్వితీయమైన వరాహమై దంతమందు భూమిని గ్రహించిన స్వభావము గలవాడా! కువలయాపీడము పడేటట్టుగా దంతమునూడ బెఱికినవాడా! నీ సుందరమైన తిరువడికళ్ళ క్రిందనే తోటయు, గృహిణియు, పశువులును, పశువుల సాలయును. చెఱువును. పంట భూమియును, నూయియునగు వీటినన్నిటిని లోపములేకుండా నేను మొత్తముగా విభజించుకొనియుంటిని. లోకమందున్న మనుష్యులతో సహవాసము నాకు దుస్సహము. దీనిని యాశపడువార నేకులు.

తి. వా. మొ. 10 ప; 6 తి. 2 పా.

పా॥ వాట్టాత్తా నడివణజ్గి మాజ్ఞాల ప్పిఅప్పఉప్పాన్
కేట్టాయే మడనెజ్ఞే కేశవ నెమ్బెరుమానై
పాట్టాయ పలపాడి ప్పళ్లవినై కళ్ పత్తఉత్తు
నాట్టారోడియల్వొళ్లిన్దు నారణనై నణ్ణినమే.

తా॥ ఈ మహాపృథివియందు జన్మను ఛేదించుకొనుటకు తిరువాట్టాఱు యందున్న స్వామియొక్క తిరువడికళ్ళను నమస్కరించి భవ్యమైన మనస్సా! వింటివా. కేశవుడైన స్వామిని గూర్చి పాశురములైనవాటిని అనేకములను పాడి ప్రాచీనమైన పాపములపట్టును ఛేదించుకొని లోకులతో సంబంధము విడచుకొని శ్రీమన్నారాయణుని సమీపించితిమి.

పెరు. తి. మొ. 3 తి. 1 పా.

పా॥ మెయ్యిల్ వాழ்க్కైయై మెయ్యెనక్కొళ్ళుమ్
ఇవ్వైయమ్ తన్నోడుమ్ కూడువదిల్లైయాన్
ఐయనే! అరఙ్గా! ఎన్ఱழைక్కిన్ఱేన్
మైయల్ కొణ్డొழிన్దే నెన్ఱన్ మాలుక్కే.

తా॥ సత్యములేని శరీరమందలి సౌఖ్యమును సత్యమని తలంచెడి యీ లోకులతోకూడా నేను కూడునదిలేదు. స్వామీ! శ్రీరంగనాథా! అని పిలచుచున్నాను. నా విషయమందు వ్యామోహముగల పెరియపెరుమాళ్ విషయమందు పిచ్చెత్తి విడచితిని.

పెరు. తి. మొ. 3 తి. 4 పా.

పా॥ ఉండియే యుడైయే యుకన్దోడుమ్. ఇ
మ్మణ్డలత్తోడుమ్ కూడువ తిల్లైయాన్
అణ్డవాణనరఙ్గన్ వన్ పేయ్ ములై
ఉణ్డవాయన్ఱ నున్మత్తన్ కాణ్మినే.

తా॥ ఆహారమునే యాదరించి పరుగెత్తెడి యీ లోకమందున్న వారితో నేను కూడునదిలేదు. బ్రహ్మాణ్డమందున్నవారికి నిర్వాహకుడును క్రూరమైన పూతనయొక్క స్తన్యమును భుజించిన నోరు గలవాడునునైన శ్రీరంగనాథుని విషయమందు వెఱ్ఱివాడను చూడండీ.

తి. వా. మొ. 3 ప. 2 తి. 9 పా.

పా॥ కూవి క్కూవి క్కొడువినై త్తూత్తుణినిన్ఱు
పావియేన్ పలకాలమ్ వழிతికైత్తు త్తలమఱుకిన్ఱేన్

మేవి యన్దానిరై కాత్తవ నులకమెల్లా
న్దావియ వమ్మానై యెజ్ఞిని త్తలైప్పెయ్‌వనే.

తా॥ క్రూరమైన పాపములనెడి తుప్పలయందు నిలచి యనేకకాల మందు దిగ్భ్రమనుజెంది తల్లడించుచున్న పాపాత్ముడనైన నేను నాడు యమరి పశువుల మందలను రక్షించినవాడును లోకముల నన్నింటిని కొలచిన స్వామియునునైనవానిని పిలచిపిలచి యికను యెచ్చట పొందెదను.

తి. వా. మొ. 9 ప. 8 తి. 4 పా.

పా॥ నాళేలఱియే నెనక్కుళ్ళన నానుమ్
మీళావడిమై ప్పణిశెయ్య ప్పుకున్దేన్
నీళార్ మలర్చ్చోలైకళ్ శూழ్ తిరునావాయ్
వాళేయ్ తడఙ్గణ్ మడప్పిన్నై మణాళా.

పా॥ పొడవై నిండియున్న పుష్పములుగల తోటలచే చుట్టువారు కొనబడిన తిరునావాయ్ యందు కాంతిచేరియున్న విశాలమైన నేత్రములుగల భవ్యరాలైన నప్పిన్నై పిరాట్టికి వల్లభుడా! నేనును విచ్ఛేదములేని దాస్యకృత్యమును చేయుటకు ప్రవేశించితిని. నాకు ఉన్న దినములైతే యెఱుగను.

పె. తి. మొ. 6 ప. 3 తి. 8 పా.

పా॥ ముళిన్దీన్ద వెజ్ఞడత్తు మూరి ప్పెరుఙ్గళిత్తాల్
విళిన్దీయ్‌న్ద మామరమ్‌పోల్ వీழ్న్దారై నినైయాతే
అళిన్దోర్న్దశినై నిన్పాలడియేఱ్కు వానులకమ్
తెళిన్దే యెన్నెయ్‌తువతు తిరువిణ్ణకరానే.

తా॥ తిరువిణ్ణకరనెడి దివ్యదేశమందున్నవాడా! ఎండి కాలిపోయిన క్రూరమైన యరణ్యమందు బలిష్ఠమైన పెద్ద యేనుగుచేత త్రోయబడి లాగబడిన గొప్పవృక్షమువలె పడినవారిని తలంపక నీ విషయమందు దృఢాధ్యవసాయముగలిగి స్నేహముగలిగి యనవరతభావనగల మనస్సుగల దాసునికి పరమపదమును ఎప్పుడు కృపజేయునది ?

తి. వా. మొ. 5 ప. 8 తి. 7 పా.

పా॥ అరియేత్తే యెన్నమ్మెబ్బొబ్బుడరే శెజ్గట్కరుముకిలే
ఎరియే పవళక్కున్తే నాల్తోళెన్దా యునతరుళే
పిరియా వడిమై యెన్నై క్కొణ్డాయ్ కుడన్దై త్తిరుమాలే
తరియే నిని యున్ శరణన్దన్ శన్మ జ్గళైయాయే.

తా॥ పురుషశ్రేష్ఠుడా! సుందరమైన బంగారమువంటి కాంతి గలవాడా! ఎఱ్ఱని నేత్రములుగల నాయొక్క నీలమేఘము వంటివాడా! అగ్నితో సమానమైన తేజస్సుగల ప్రవాళపర్వతము వంటివాడా! నాలుగు భుజములుగల నా స్వామీ! నీ కృపచేత నన్ను విచ్ఛేదము లేని కైంకర్యమందు స్వీకరించితివి. తిరుక్కుడన్దైయందు వేంచేసియున్న శ్రియఃపతీ! ఇక ధరించను. నీ తిరువడికళ్ళు నిచ్చి నా జన్మమును పోగొట్టుము.

తి. వా. మొ. 6 ప. 9 తి. 6 పా.

పా॥ పాయోరడివైత్త తన్గీళ్ పరవై నిలమెల్లా
న్దాయోరడియా వెల్లావులకు న్దడవన్ద
మాయో నున్నై క్కాణ్బాన్ వరున్ది యెనైనాళుమ్
తీయోడుడన్ శేర్ మెఴుకా యులకిల్ తిరివేనో.

తా॥ ఒకపాదమును వ్యాపింపజేసివైచి దానిక్రింద సముద్రావృత మైన భూమినంతను కొలచి మరియొక పాదముచేత సమస్త లోకము లను స్పృశించిన యాశ్చర్య భూతుడా! నిన్ను సేవించుటకొరకు యనేక కాలము శ్రమపడి యగ్నితోకూడా చేరిన మైనమువలె లోక మందు తిరిగెదనా?

తి. వా. మొ. 10 ప. 10 తి. 8 పా.

పా॥ పెత్తినిప్పోక్కవనో వున్నై యెన్నని ప్పేరుయిరై
యుత్తవిరువినై యాయుయిరాయ్ ప్పయనా యవైయాయ్
ముత్త విమ్మూన్రువులగుమ్ పెరున్దూణాయ్ త్తూత్తిప్పుక్కు
ముత్తక్కరన్దాళిత్తాయెన్ ముతల్ త్తనివిత్తేయో.

తా॥ నాయొక్క యద్వితీయమై విభువైన ప్రాణమైన వాడవును యాత్మతో చేరియున్న రెండు విధములైన కర్మలకు నిర్వాహకుడ వును ఆత్మలకు నిర్వాహకుడవును, కర్మఫలములకు నిర్వాహకుడ వును, ఈ మూడు లోకములనెడి పూర్ణమైన పెద్ద తుప్పను సృజించి యా తుప్పయందు ప్రవేశించి యుంతటను వ్యాపించి దాగి యున్న వాడా! నాయొక్క యద్వితీయమైన ప్రథమ సుకృత మైనవాడా! నిన్ను పొంది యికను విడచెదనా?

తి. వా. మొ. 10 ప. 10 తి. 2 పా.

పా॥ మాయజ్ఞాయ్యే లెన్నై యున్ తిరుమార్వత్తు మాలైనజ్ఞై
వాళజ్ఞాయ్ పూజ్గుళ్లులాళ్ తిరువాణై నిన్నాణై కణ్డాయ్
నేళజ్ఞాయ్ తు న్నోడెన్నై యుయిర్ వేఱిన్ఱియొన్నాక వే
కూళజ్ఞాయ్యాతు కొణ్డాయెన్నై కూ్కవిళ్కొళ్ళాయ్ వన్దన్దో.

ఇన్నతోర్ తన్నైయరా యాఙ్ఞుడలమ్ విట్టెర్ద్ను
తొన్నెఱిక్కణ్ శెన్నారెఎప్పడుం శొల్లల్లాల్
ఇన్నతోర్ కాలత్తినైయా రితు పెఱ్ఱార్
ఎన్నవుం కేట్టఱివతిల్లై - ఉళతెన్నిల్
మన్నుఙ్కడు ఙ్గతిరోన్ మణ్డిత్తి నన్నడువుళ్
అన్నతోరిల్లియినూడుపోయ్ వీడెన్నుమ్
తొన్నెఱిక్కణ్ శెన్నారై చ్చొల్లుమిన్గళ్ శొల్లాతే
అన్నతే పేసుమఱివిల్ శిఱుమనత్తు ఆ
ఙ్గన్నవరై కఱ్పిప్పోమ్ యామే

తా॥ ధర్మార్థకామమోక్షములు నాల్గింటిలోను ఆఖరిదైన మోక్షము శరీరావసానమునకు తరువాత పురుషార్థము నిచ్చును అని చెప్పబడుచున్న యద్వితీయమై ప్రాచీనమైన ప్రాప్యమును అపేక్షించేవారు రాలినపండ్లును, ఎండిపోయిన ఆకులును అని చెప్పబడుచున్న వీటినే భక్షించి తాము శరీరమును కష్టపరచి నిబిడమైన యాకులచే చేయబడిన కుటీరములయందు నిద్రించియు, ఉష్ణకిరణుడైన సూర్యుని యొక్క పొందియున్న వేడిమిని పానముజేసియు, సుందరమైన తటాకములలోపల మునిగియుండియు, ఇటువంటియొక స్వభావము కలవారై యీలోకమందు శరీరమును వదలి లేచిపోయి యనాదియైన ప్రాప్యభూమియైన మోక్షమునకు వెళ్ళినరు అని చెప్పబడుచున్న మాట తప్ప ఇటువంటిది యొక కాలమం దిటువంటివారిది పొందినారు అనగానున్నా విని యెరిగినదిలేదు ఉన్నదంటే నిత్యమై క్రూరమైన కిరణములుగల సూర్యునియొక్క విలక్షణమైన మండలముయొక్క మధ్యనున్న యటువంటి యొకరంధ్రముమధ్యనుంచి పోయి మోక్షమనెడి యనాదియై ప్రాప్యమైన దేశమందు వెళ్ళినవారిని చెప్పాను

అంటే చెప్పక ఆమాటనే చెప్పుచున్నవారై యావిషయమందు జ్ఞానములేనివారై చిన్నమనస్సుగల యటువంటివారిని మేమే యభ్యసింపజేసెదము.

ఇయఱ్పా. శి. తి. మ. 6 పా.

పా॥ కారార్ పురవియేழ் పూణ్డతనియాழி
తేరార్ నిఱై కతిరోన్ మణ్డలత్తై కీణ్డుపుక్కు
ఆరావముత మఙ్గెయ్ తి - అతినిన్ఱుమ్
వారా తొழிవతొన్ఱుణ్డే.

తా॥ మేఘమండలమందు సంచరించుచున్న యేడు గుఱ్ఱములను పూన్చిన యొకచక్రముగల రథముగలవాడై పూర్ణమైన కిరణములు గలవాడైన సూర్యునియొక్క మండలమును భేదించుకొని పోయి పరమపదమును ప్రవేశించి యచ్చట తృప్తిలేని యమృతమువంటి పరమపురుషుని పొంది యాపరమపదమునుండి రాకుండా విడుచున దొకటి కలదా ?

తి. వా. మొ. 10 ప. 10 తి. 10. పా.

పా॥ శూழ்న్దకన్ఱాழ்న్దుయర్న్ద ముడివిల్ పెరుమ్పాழ்యే
శూழ்న్దతనిల్పెరియ పరనన్మలర్ చ్చోతీయో
శూழ்న్దతనిల్పెరియ శుడర్ఞాన విన్బమేయో
శూழ்న్దతనిల్పెరియ వెన్నవా వఱచ్చూழ்న్దాయే.

తా॥ చుట్టును వ్యాపించి యంతటను వ్యాపించి క్రిందుగా వ్యాపించి మీదుగావ్యాపించిన నాశము లేనిదై గొప్పదై భోగమోక్షసాధకమైన మూలప్రకృతికి యంతరాత్మయైనవాడా ! దానిని వ్యాపించి దానికంటె గొప్పదై మేలై విలక్షణమై వికాసస్వభావముగల తేజోమయ

మైన జీవాత్మల కంతరాత్మయైనవాడా! దానిని వ్యాపించి దానికంటె గొప్పదై యుజ్వలమై జ్ఞానానన్దమూర్తియైన పరమాత్మస్వరూపుడా! ఈ తత్వత్రయమును వ్యాపించి యంతకంటె గొప్పదైన నా యభి నివేశము తీరునట్లు సంశ్లేషించితే

శ్లో॥ భీతోఽస్మ్యహం మహాదేవ శ్రుత్వా మార్గస్య విస్తరమ్ (ఆకరం తెలియదు)

తా॥ మహాదేవా! నేను యామ్యమార్గముయొక్క విస్తారమును విని భయపడినవాడనైతిని

పెరి తి మొ 4 ప 5 తి 7 పా

పా॥ తెన్నవన్డమర్ శెప్పమిలాతార్ శేవతక్కవార్ పోల ప్పుకున్దు పిన్నుమ్ వన్కయిత్తాల్పిణి తెత్తిప్పిన్ మున్నాకి విఱ్ఱుప్పతన్ మున్నమ్

ఇన్నవ నినై యానెన్డు శొల్లియెణ్ణి యుళ్ళత్తిరుళఅ నోక్కి మన్నవన్ మతుశూతన నెన్బార్ వానకత్తు మన్నాడికళ్ తామే.

తా॥ యమభటులు లార్జవము లేనివారు ఎడ్లను యదల్చేవారువలె ప్రవేశించి తరువాతను ప్రబలమైన పాశములచే కట్టి కుదవేసి వెనుకకు ముందుకు లాగకమునుపే రాజైన మధుసూదనుడు వీడు యిట్టివాడుయని చెప్పి యనుసంధించి మనస్సునందలి యజ్ఞానాంధకారము పోవునట్లు చూచి చెప్పువారు తమరే పరమపదమందు యెదిరింతురు.

పెరి తి మొ 4 ప 5 తి 5 పా

పా॥ మడివప్పి వన్దు సీఱ్ఱులన్ శోరవాయిలట్టియ కణియుమ్మిణాణ్డె కడైవళ్ళివార కడుణ్డమడైప్ప కణ్ణుఅక్క మతావతన్ మున్నమ్

తుఱై వళ్లి యుమ్మై నాయ్ కళ్ కవరా శూలత్తాలుమ్మై
పాయ్ వతుం శెయ్యార్

ఇడై వళ్లియిల్ సీర్ కూత్తై యుమిళ్లువీర్ ఇరుడి కేశ నన్దేత్త వల్లీ రే.

తా॥ ఒడిమార్గముగా వచ్చి యంగముయొక్క నీరు కారగా నోటి యందు పోసిన గంజికూడా కంఠము బాధించుటచేత తిరిగీ చెలిమెల వెంబడిని ప్రవహించగా దీర్ఘనిద్రమైనది కాకమునుపే హృషీకేశుడని స్తోత్రము చేయుటకు సమర్థులైతే మిమ్ముని తోడమార్గముగా కుక్కలు కరువవు. శూలములచే మిమ్మని పొడుచుటయును చేయరు. మీరు మధ్యమార్గమందు వస్త్రమునుకూడా చెడరు.

తి. చ. వి. 66 పా.

పా॥ ఇన్ఱు శాతల్ నిన్ఱుశాత లన్ఱియూరుమ్ వైయక
త్తొన్ఱినిన్ఱు వాళ్తల విన్మైకణ్డుమ్ నీశరెన్కొలో
అన్ఱుపారళన్ద పాతపోతై యొన్ఱివానిన్మేల్
శెన్ఱుశెన్ఱు తేవరా యిరుక్కిలాతవణ్ణమే.

తా॥ ఇప్పుడే చచ్చుట చిరకాలముండి చచ్చుట కాక యెవరును భూమియందు పొందియుండి సుఖించుట లేకపోవుటను చూచిన్నీ నీచులు నాడు భూమిని కొలచిన పాదపద్మమును తలంచి వెళ్ళి పరమ పదమందు వెళ్ళి నిత్యసూరులతో సమానులై యుండనిదేమో!

పె. తి. మొ. 11 ప. 4 తి. 5 పా.

పా॥ వెన్ఱిఱల్ వాణన్ వేళ్వియిడ మెయ్ తి యఙ్గోర్ కుఱళాకి
మెయ్ మ్మైయుణర
చెన్దొళ్లిల్ వేతనావిల్ మునియాకి వైయ్యమడి మూన్ఱిరన్దు
పెఱినుమ్

మన్దరమీాతుపోకి మతినిన్తిజైఇ్జ మలరోన్ వణజ్గ వళర్ శేర్
అన్దరమేఘ్రినూడు శెలవుయ్త్త్ పాతమతు నమ్మెర్రయాళు
మ౨ శే

తా॥ తీక్ష్ణమైన బలముగల మహాబలియొక్క యజ్ఞవాటమునుపొంది యచ్చట నద్వితీయమైన వామనుడై సత్యమును తెలసినవాడై శ్లాఘ్యమైన కర్మలుగల వేదము నాలుకయందుగల ఋషియై భూమిని మూడడుగులను యాచించి లభించగానే మందరపర్వతమునకు మీాదుగాపోయి చంద్రుడు ఉండీ నమస్కరించేటట్టుగాను కమలభవుడైన బ్రహ్మ నమస్కరించేటట్టుగాను వృద్ధిపొందుచున్నదై యూర్ధ్వలోకము లేడింటి మధ్యనుండి వెళ్ళునట్లుగా పంపిన యాపాదము మన నేలుకొనెడి రాజు.

తి. వా. మొ. 10 ప. 10 తి. 8 పా.

పా॥ పెత్తినిప్పోక్కవనో వున్నె యెన్ఱనిప్పఉయిరై
యుత్తవిఱువినైయా యుయిరాయ్ ప్పయనా యవైయాయ్
ముత్తిమ్మూవులను మ్ పెఱన్దాఙాయ్ ల్ తూత్తిల్ పుక్కు
ముత్తక్కరన్దొళిత్తా యెన్ముత తనివిత్తేయో.

తా॥ అద్వితీయుడై విభువై నాకు ప్రాణభూతుడై యున్నవాడవును యాత్మతో చేరియున్న రెండువిధములైన కర్మలకు నిర్వాహకుడవై జీవాత్మలకు నిర్వాహకుడవై యా కర్మలకు ఫలములైన సుఖదుఃఖములకు నిర్వాహకుడవై యీ మూాడులోకములను సంపూర్ణముగా పెద్ద తుప్పవలె సృష్టించి యా పొదయందు ప్రవేశించి యంతటను వ్యాపించి దాగియున్నవాడవై నా కద్వితీయమైన ప్రధమ సుకృతమైన వాడా! నిన్ను పొంది యికను విడచెదనా?

ఇయఱ్పా. తి. వి. 100 పా.

పా॥ నల్లార్ నవిల్ కురుకూర్ నకరాన్ తిరుమాల్ తిరుప్పేర్
వల్లారడిక్కణ్ణిశూడియ మాఱన్ విణ్ణప్పమ్ శెయ్త
శొల్లార్ తొడైయలిన్నూఱుమ్ వల్లార ముఱ్ఱార్ పిఱప్పామ్
పొల్లావరువిన్నై మాయవన్ శేఱ్ఱళ్ళల్ పొయ్న్నిలత్తే.

తా॥ విలక్షణులచే స్తోత్రము చేయబడిన తిరునగరికి స్వామియై శ్రియఃపతియొక్క తిరునామముల ననుసంధించుటకు సమర్థులైనవారి యొక్క పాదము లనెడి మాలికను ధరించినన మ్మాళ్వార్లు విన్నవించిన శ్రీసూక్తులచే పూర్ణమైయున్న మాలారూపమైన యీ నూరుపాశురములను అనుసంధించుటకు సమర్థులైనవారు జన్మచే కలిగెడి దుష్టమై దుస్తరమైన పుణ్యపాపములకు హేతువై యాశ్చర్యకరమైన బలిష్ఠమైన చిక్కటి బురదవంటి యసత్యశబ్దవాచ్యమైన ప్రకృతియందు మునగరు.

శ్లో॥ తతస్తు విరజాతీరప్రదేశమ్ సఆగచ్ఛతివిరజాంనదీమ్ (ఆకరము తెలియదు.)

తా॥ తరువాతనయితే విరజాతీరప్రదేశము. ఆముక్త పురుషుడు విరజానదినిగూర్చి వచ్చుచున్నాడు.

శ్లో॥ తత్తోయస్పర్శమాత్రేణ (ఆకరము తెలియదు.)

తా॥ ఆ విరజానదియొక్క ఉదకస్పర్శమాత్రముచేత.

శ్లో॥ సూర్యకోటిప్రతీకాశః (ఆకరము తెలియదు.)

తా॥ వేయిమంది సూర్యులతో సమానమైనవాడై.

శ్లో॥ అమానవం సమాసాద్య (ఆకరము తెలియదు.)

తా॥ అమానవుని పొంది.

తి. వా. మొ. 9 ప. 1 తి. 5 పా.

పా॥ శతిరమెన్రు తమ్మై త్తామే శమ్మతిత్తి, న్మొత్తియార్
మతురపోకమ్ తుర్ న్దవరే వైకి మర్ ఱాన్ఱుఱువర్
అతిర్కొళ్ శెయ్కై యశురర్ మఙ్గ వడమతురై ప్పిఱన్దాఱ్కు
ఎతిర్కొళాళా యుయ్యలల్లా లిల్లై కణ్డీరిన్బమే.

తా॥ చాతుర్యము కలవారమని తమను తామే సమ్మతించి మధుర మైన మాటలుగల స్త్రీలయొక్క మధురమైన భోగముల ననుభ వించినవారే కొంతకాలము గడచిన తరువాత వేరొకదానిని (అవ మానమును) పొందుదురు. లోకమదురునట్టి వ్యాపారములుగల యసురులు నశించునట్లుగా నుత్తరమధురయం దవతరించిన శ్రీకృష్ణుని విషయమం దాభిముఖ్యముగల దాసులై యుజ్జీవించుట తప్ప మరి సుఖము లేదు చూడండీ.

తి. వా. మొ. 2 ప. 8 తి. 4 పా.

పా॥ పులనైన్దుమేయుమ్ పొఱియైన్దునీఙ్గి
నలమన్దమిల్లతోర్ నాడుపుకువీర్
అలమర్న్దు వీయ వశురరై చ్చెర్ ఱాన్
పలమున్దుశీరిల్ పడిమినోవాతే.

తా॥ విషయముల నైదింటిని మేసెడి (యనుభవించెడి) యింద్రియము లైదింటినుండి నివృత్తులై యానందమున కంతములేని యద్వితీయ మైన పరమపదమును ప్రవేశించేవారలారా! తల్లడించి నశించున ట్లసురులను సంహరించినవానియొక్క ఫలము ముందుగా నున్న కల్యాణగుణములయందు విచ్ఛేదము లేకుండా యవగాహించండి.

తి. వా. మొ. 10 ప. 6 తి. 1 పా.

పా॥ అరుళ్ పెఱువారడియార్తమ్మడియనేఱ్కు ఆళ్తియాన్
అరుళ్ తరువా నమైకిన్రా నతునమతు విదివకై యే
ఇరుళ్ తరు మాఞాలత్తు ళినిప్పిఱవి యాన్ వేణ్డేన్
మరుళొళ్తి నీమడనెఞ్జే వాట్టాఱ్ త్తా నడివణజ్గే.

తా॥ భగవత్కృపను పొందదగిన భాగవతులకు దాసుడనైన నాకు చక్రధరుడు కృపను జేయుట కుద్యోగించుచున్నాడు. అదికూడా మన నియమనప్రకారమే. అజ్ఞానమును కలుగజేయు మహాపృధివియం దిక జన్మను నే నపేక్షించను. భవ్యమైన మనసా! అజ్ఞానమును విడువుము. తిరువాట్టారుయందు వేంచేసియున్నవానియొక్క పాదముల నాశ్రయించుము.

తి. వా. మొ. 9 ప. 7 తి. 5 పా.

పా॥ తెళివిశుమ్బు కడితోడి తీవళైత్తు మిన్నిలకుమ్
ఒళిముకిల్ కాళ్ తిరుమూళ్తిక్కళత్తు ఉఱైయుమొణ్ శుడర్కు
త్తెళివిశుమ్బు తిరునాడా త్తీవినైయేన్ మనత్తు ఉఱైయుమ్
తుళివార్కట్కు ళ్ఴలార్క్కెన్ తుతురైత్తల్ శెప్పుమినే.

తా॥ నిర్మలమైన యాకాశమందు శీఘ్రముగా పరుగెత్తి యగ్నిచక్రమువలె మెఱుపులు ప్రకాశించుచున్న సుందరమైన మేఘములారా! తిరుమూళ్తిక్కళమందు నిత్యవాసముజేయు సుందరమైన కాంతిగలవాడును, స్వచ్ఛమైన పరమాకాశముగా (పరమపదముగా) క్రూరమైన పాపములుగల నామనస్సునందు నిత్యవాసముజేయు బిందువులు ప్రవహించుచుచున్న మకరందముగల కేశపాశము గలవాడును నైన శ్రియఃపతికి నా దూతవాక్యమును చెప్పుడు.

తి. వా. మొ. 10 ప. 8 తి. 4 పా.

పా॥ ఎళితాయినవా తెన్దన్ కణ్గళ్ కళిప్ప
కళితాగియ శిన్దైనాయ్ కళికిన్దేన్
కిళితావియ శోలైకళ్ శూళ్న్ద తిరుప్పేరాన్
తెళితాకియ శేణ్ విశుమ్బు తరువానే,

తా॥ సులభమైన ప్రకారమని నా నేత్రము లానందించగా సంతో షించిన మనస్సుకలవాడనై యానందించుచున్నాను, చిలుకలు సంచ రించుచున్న తోటలచే చుట్టువారుకొనబడిన తిరుప్పేర్ యందు వేం చేసియున్నవాడు ప్రకాశించుచున్న ఉత్తమమైన పరమపదము నిచ్చు వాడు.

పె. తి. మొ. 7 ప. 10 తి. 9 పా.

పా॥ పణ్ణినై ప్పణ్ణిల్ నిన్ఱతోర్ పాన్మైయై ప్పాలుళ్ నెయ్యినై మాలురువాయ్ నిన్ఱ
విణ్ణినై విళఙ్గు శుడర్ శోతియై వేళ్వియై విళక్కినొళితనై
మణ్ణినై మలైయై యలైనీరినై మాలై మామతియై మఱైయోర్ తఙ్గళ్
కణ్ణినై కణ్గళారళవుమ్ నిన్ఱు కణ్ణమఙ్గైయుళ్ కణ్డుకొణ్డేనే.

తా॥ రాగమువలె భోగ్యమైనవాడును రాగమందున్న ఒక స్వభా వమువంటివాడును పాలయందలి నెయ్యివంటివాడును గొప్పరూపము గలదై యున్న యాకాశమువంటివాడును ప్రకాశించెడి యుజ్వలమైన తేజస్సైనవాడును యజ్ఞములకు నిర్వాహకుడును దీపముయొక్క తేజస్సైనవాడును భూమివంటి వాడును పర్వతమువంటి వాడును. తరంగించుచున్న సముద్రమువంటివాడును ఆశ్రితులయందు వ్యామో

హాముగలవాడును గొప్ప చంద్రునివంటివాడును వేదాధ్యయన పరులైన బ్రాహ్మణులకు నేత్రమువంటివాడునునైన వానిని నేత్రములు నిండువరకు నిలచి తిరుక్కణ్ణమఙ్గైయందు సేవించితిని.

తి. వా. మొ. 4 ప. 4 తి. 1 పా.

పా॥ మణ్ణైయిరున్దు తుళావి వామనన్ మణ్ణిదు వెన్నుమ్
విణ్ణైత్తొழுదవన్ మేవు వైకున్దమెన్ఱు కైకాట్టుమ్
కణ్ణైయుణ్ణీర్ మల్కనిన్ఱు కడల్ వణ్ణనెన్నుమ్ మన్నే; ఎన్
పెణ్ణై ప్పెరుమయల్ శెయ్ తార్కెన్ శెయ్ కేన్ పెయ్ వళై
యీర్‌గే.

తా॥ భూమిని కూర్చొని తడమి వామనుని భూమి యిది యనును. ఆకాశమునుగూర్చి నమస్కరించి వాడు నిత్యవాసము జేయుచున్న వైకుంఠమని చేతిచే కనపరచును. నేత్రములయందు నీరు సమృద్ధమగునట్లు నిలచి సముద్రవర్ణు డనును. అమ్మ! నాయొక్క కుమార్తెనుగూర్చి గొప్పవ్యామోహమును కలుగజేసినవారికి ధరించబడిన కంకణములు కలవారలారా! ఏమిచేసెదను ?

పెరి. తి. మొ. 1 ప. 2 తి. 2 పా.

పా॥ ఓడువార్ విழுవారు కన్దాలిప్పార్
నాడువార్ నమ్బిరా నెఙ్గుత్తా నెన్బార్
పాడువార్కళుం పల్పఱై కొట్టనిన్ఱు
ఆడువార్కళు మాయిత్తాయ్ప్పాడియే.

తా॥ ౘపల్లై పరుగెత్తువారును పడిపోయేవారును సంతోషించి యాలకించువారును వెతకువారును మా కుపకారకుడైనవా డెక్క

డున్నాడు అనెడివారును పాడువారును అనేక వాద్యములను కొట్టగా నాడువారును యైనది.

పా॥ కణ్ణోమ్ కణ్ణోమ్ కణ్ణోమ్ కణ్ణుక్కినియన కణ్ణోమ్
తొణ్డీరెల్లీరుమ్ వారీర్ తొ౦ఱ్రుతు తొ౦ఱ్రుతు నిన్ఱాఱుమ్
వణ్డార్ తణ్ణన్తుళాయాన్ మాతవన్ పూతజ్గళ్ మణ్మేల్
పణ్డాన్ పాడినిన్ఱాడి ప్పరన్దు తిరికిన్ఱనవే.

తా॥ భ్రమరములచే పూర్ణమైన చల్లని సుందరమైన తిరుత్తుళాయ్ మాలికచే నలంకరించబడిన శ్రియఃపతియొక్క దాసులు భూమిపైని రాగములను పాడి నిలచియాడి వ్యాపించి తిరుగుచున్నారు. నేత్రములకు భోగ్యమైన దానిని చూచితిమి. దాసులందరును రండు. నమస్కరించి నమస్కరించి యుండి మంగళాశాసనము చేసెదము.

శ్రు॥ తం పఞ్చశతా న్యప్సరసాం ప్రతిధావంతి. శతం మాలా హస్తాః శత మంజనహస్తాః. శతం చూర్ణహస్తాః, శతం వాసోహస్తాః. శతం భూషాహస్తాః. తం బ్రహ్మాలంకారేణా లంకుర్వన్తి.
(ఆకరము తెలియదు.)

తా॥ ఆముక్తపురుషునిగూర్చి ఐదువందలమంది దివ్యాప్సరసలు యెదురుగా పరుగెత్తుదురు. నూరుమంది మాలికలు హస్తమందు గలవారు. నూరుమంది అంజనము హస్తమందు గలవారు. నూరుమంది పసపుపొడి హస్తమందు గలవారు. నూరుమంది వస్త్రములు హస్తమందు గలవారు. నూరుమంది భూషణములు హస్తమందు గలవారు. ఆముక్తపురుషుని బ్రహ్మాలంకారముచేత నలంకరించుచున్నారు.

శ్లో॥ తత్రాగత్యచ తే దేవా స్సాధ్యాశ్చ విమలాశయాః (ఆకరము తెలియదు.)

తా॥ నిర్మలమైన యభిప్రాయముగల యాసాధ్యదేవత లచ్చటకు వచ్చిన్నీ.

శ్లో॥ బ్రహ్మాలంకారేణ బ్రహ్మా ంక్రియా (ఆకరము తెలియదు.)

తా॥ బ్రహ్మాలంకారముచేతను బ్రహ్మాలంక్రియా.

పెరి. తి. మొ. 1 ప. 1 తి. 9 పా.

పా॥ ఉడుత్తు క్కళైన్ద నిన్ పీతకవాడై యుడుత్తు క్కలత్తతుణ్డు
తొడుత్త తుళాయ్ మలర్ శూడిక్కళైన్దన శూడుమిత్తొణ్డర్
కళోమ్.
విడుత్తతిశై కరుమమ్ తిరుత్తి త్తిరువోణత్తిరువిళ్లావిల్
పడుత్తపైన్నాకణై ప్పళ్ళికొణ్డానుక్కు ప్పల్లాణ్డు కూరుదుమే.

తా॥ ధరించి విడచిన నీ పీతాంబరమును ధరించి, పాత్రశేషమును భుజించి, విడచిన కూర్చబడిన తిరుత్తుళాయ్ పుష్పములను ధరించెడి యీ దాసులమైన మేము, ఆజ్ఞాపించిన దిక్కుయందలి కార్యములను దిద్ది శ్రవణనక్షత్రోత్సవమందు పరవబడిన విశాలమైన నాగపర్యంక మందు పవ్వళించిన స్వామికి అనేక సంవత్సరములు మంగళమని చెప్పుదుము.

పా॥ పునైయిళైక ళణివు మాడై యుడై యుమ్ పుతుకణిప్పమ్
నినైయు నీర్మైయతన్నిపట్కితునిన్తు నినైక్కప్పాకాల్
శునైనుట్టడ న్దామరై మలరు న్దణ్డిరుప్పాలియూర్
మునైవన్ మూవులకాళియప్ప న్తిరువరుళ్ మూంఘ్రకినళే.

తా॥ అలంకరించుకొనదగిన యాభరణములయొక్క యలంకారమును, బట్టకట్టును నూతనమైన శోభయును ఇది నిలచి తలంచ

బోతే యిది యీమెకు తలంపదగిన స్వభావముగలదికాదు. సరస్సుల యందు విశాలముగా తామరపుష్పములు వికసించుచున్న చల్లని తిరు ప్పులియూరుకు ప్రధానుడై మూడులోకములను పరిపాలించువాడైన స్వామియొక్క దివ్యకృపయందు మునిగినది.

తి. వా. మొ. 10 ప. 9 తి. 8. పా.

పా॥ కుడియడియా రివర్ కోవిన్దన్దనక్కొన్ఱు
ముడియుడై వానవర్ ముఱైముఱై యెతిర్కొళ్ళ
క్కొడియణినెడుమతిళ్ కోపురజ్ఞుఱుకినర్
వడివుడై మాతవన్ వైకున్దమ్పుకవే.

తా॥ వీరు కృష్ణునికి కులదాసులని కిరీటములుగల నిత్యసూరులు క్రమ క్రమముగా నెదుర్కొనగా సౌందర్యముగల శ్రియఃపతియొక్క శ్రీవైకుంఠమును ప్రవేశించుటకై ధ్వజములచే నలంకరించబడిన గొప్ప ప్రాకారములుగల గోపురమును సమీపించిరి.

తి. వా. మొ. 10 ప. 9 తి. 9 పా.

పా॥ వైకున్దమ్పుకుతలుమ్ వాశలిల్ వానవర్
వైకున్దన్దమరెమ రెమతిడమ్ పుకుతెన్ఱు
వైకున్దత్తమరరుమ్ మునివరుమ్ వియన్దనర్
వైకున్దమ్పుకువతు మణ్ణవర్ వితియే॥

తా॥ శ్రీవైకుంఠమును ప్రవేశించగానే ద్వారమందున్న నిత్యసూరులు శ్రీవైకుంఠనాథుని భక్తులైన మీరు మా కుద్దేశ్యులు మా స్థానము లను ప్రవేశించండని యామోదించిరి. శ్రీ వైకుంఠమందున్న కైంకర్య నిష్ఠులును భూలోకమందున్నవారు శ్రీవైకుంఠమును ప్రవేశించుట భాగ్యమే యని సంతోషించిరి.

రా. అ. కా. 16 స. 5 శ్లో.

శ్లో॥ స తదంతః పురద్వారం సమతీత్య జనాకులమ్
ప్రవివిక్తాం తతః కక్ష్యా మాససాద పురాణవిత్

తా॥ ప్రాచీనమైన మర్యాదల నెఱిగిన యీ సుమంత్రుడు జనులచేత వ్యాకులమైన యీ అంతఃపుర ద్వారమును దాటి తరువాత మిక్కిలి వివిక్తమైన యంతరువును పొందెను.

ఇయఱ్పా. పె. తి. మ. 73 పా.

పా॥ ఇరుమ్బుఱ్రిల్ శూழ்

మన్నుమదిళ్ తిరునఱైయూర్ మామలై పోల్
పొన్నియలుమాడ క్కవాడమ్ కడన్దుపుక్కు
ఎన్నుడై యకణ్ కళిప్పనోక్కినేన్.

తా॥ గొప్ప తోటలచే చుట్టువారు కొనబడిన వేదాధ్యయనపరులు నిత్యవాసము జేయుచున్న తిరునఱైయూర్ యందు గొప్ప పర్వతము వలెనున్న స్పృహణీయమైన మండపముయొక్క కవాటమును దాటి ప్రవేశించి నాయొక్క నేత్రము లానందించునట్లు చూచితిని.

పె. తి. మొ. 8 ప. 5 తి. 10 పా.

పా॥ వార్కొళ్ మెన్ములై మడన్దైయర్ తడజ్గడల్ వణ్ణనై

త్తాళ్నయన్దు

ఆర్వత్తా లవర్పులమ్బియ ప్పులమ్బలైయఱిన్దు మున్నురై శెయ్త
శీర్కొళ్ పూమ్బుఱ్రిల్ మఙ్గైయార్కావలన్ కలికన్ఱి

యొలివల్లార్

ఏర్కొళై వైకున్దమానక రప్పక్కమెయవరోడు జ్గూడువరే.

తా॥ రవికగల మృదువైన స్తనములుగల స్త్రీలు విశాలమైన సము ద్రమువంటి వర్ణము గలవాని తిరువడికళ్ళ నాశపడి యభినివేశముచే వారు మొరబెట్టిన మొఱ్ఱను తెలుసుకొని పూర్వము సాయించిన మేఘములు సంచరించుచున్న పుష్పోద్యానములుగల తిరుమజ్జైయం దున్నవారికి రక్షకులైన తిరుమజ్జైయాళ్వార్ యొక్క శ్రీసూక్తిని యభ్యసించ సమర్థులైనవారు సుందరమైన వైకుంఠమహానగరమును ప్రవేశించి నిత్యసూరులతోకూడా కూడుదురు.

తి. వా. మొ. 6 ప. 1 తి. 7 పా.

పా॥ ఒరువణ్ణమ్ శెన్రు పుక్కునక్కున్రురై యొణ్గిళియే
శెరువొణ్బుమ్బొళ్గిల్ శూళ్గ్ శెక్కర్వైలై త్తిరువణ్వణ్డూర్
కరువణ్ణమ్ శెయ్యవాయ్ శెయ్యకణ్ శెయ్యకై శెయ్యకాల్
శెరువొణ్ శక్కర మ్జ్జైయాళ న్దిరున్దక్కణ్డే.

తా॥ సుందరమైన చిలుకా! స్పర్ధనుచేసి సుందరమైన పుష్పములను పుష్పించెడి తోటలచే చుట్టువారు కొనబడిన యెర్రని సముద్రతీరము గల తిరువణ్వణ్డూరులో నొకవిధముగా వెళ్ళి ప్రవేశించి నల్లని వర్ణ మును యెఱ్ఱని యధరమును యెఱ్ఱని నేత్రములును యెఱ్ఱని హస్త ములు యెఱ్ఱని పాదములును యుద్ధోన్ముఖమైన సుందరమైన చక్ర మును, శంఖమును ఆనవాలుగా గలవానిని చక్కగా చూచి నా కొర కొక మాటను చెప్పుము.

ఇయత్పా. తి. వి. 47 పా.

పా। తిరికిన్రతు వడమారుతమ్ - తిజ్గళ్ వెన్దీముకన్దు
శొరికిన్రతు మతువుమతు - కణ్ణన్ విణ్ణూర్ తొళ్గవే

శరికిన్దతు శజ్గమ్ తణ్ణన్దుళ్ళాయ్ కుళ్ళవణ్ణమ్పయలై
విరికిన్దతు ముట్రుమెయ్యుమ్ ఎన్నాజ్గో మెన్మల్లియత్కే.

తా॥ ఉత్తరపుగాలి సంచరించుచున్నది. చంద్రుడు క్రూరమైన నిప్పును గ్రసించుకొనివచ్చి వర్షించుచున్నాడు. ఆ గాలియు నటులనే నిప్పును వర్షించుచున్నది. శ్రీకృష్ణునియొక్క పరమాకాశమందున్న పరమపదమును నమస్కరించగానే శంఖపుగాజులు జారిపోయినవి. చల్లనై సుందరమైన తిరుత్తుళాయికి యాశపడి వర్ణము వివర్ణమై శరీరమం దంతటను వ్యాపించుచున్నది. నాయొక్క మృదుస్వభావురాలైన యీమెకు యేమగునో ?

తి. వా. మొ. 8 ప. 6 తి. 5 పా.

పా॥ కోయిల్కొణ్డాన్ద న్దిరుక్కడిత్తానత్తై
కోయిల్కొణ్డానతనోడు మెన్నెఞ్జకమ్
కోయిల్కొడెయ్వ మెల్లాన్దొళ వైకున్ద
గోయిల్కొణ్డ కుడక్కూత్తవమ్మానే.

తా॥ కోయిలలుగల దైవములైన నిత్యసూరులు నమస్కరించే ప్రకారముగా పరమపదమును వాసస్థానముగా స్వీకరించిన ఘటనృత్యమాడిన స్వామి తిరుక్కడిత్తానమును తనకు వాసస్థానముగా స్వీకరించెను. దానితోకూడా నామనస్సును వాసస్థానముగా స్వీకరించెను.

తి. వా. మొ. 7 ప. 10 తి. 11 పా.

పా॥ తీర్తనుక్కఱ్ఱపిన్ మఱ్ఱోర్శరణిల్లై యెన్ణెణ్ణి తీర్తనుక్కే
తీర్త మనత్తననాకి చ్చెట్రుజ్గురుకూర్ చ్చడకోపన్ శొన్న
తీర్తజ్గళాయిర త్తుళ్ళివై పత్తుం వల్లార్కళై త్తేవర్ వైకల్
తీర్తజ్గళే యెన్రు పూశిత్తు నల్గి యురైప్పర్ తన్దేవియర్కే.

తా॥ పావనుడైన సర్వేశ్వరునికి శేషపడినతరువాత వేరొక యుపాయము లేదని తలంచి యా పావనునికే యధీనముగా జేయబడిన మనస్సుగలవారై సుందరమైన తిరునగరికి నిర్వాహకులైన నమ్మాళ్వార్ సాయించిన తీర్థస్వరూపములైన వేయి పాశురములయందు నీ పది పాశురములను నభ్యసించినవారిని నిత్యసూరులు ప్రతిదినమును తమ దేవిమార్లకు పావనులేయని పూజించి స్నేహముతో చెప్పుదురు.

తి. వా. మొ. 10 ప. 9 తి. 10 పా.

పా॥ వితివకై పుకున్దరెన్ఱు నల్ వేతియర్
పతియిని ఱ్ఱాఙ్గిని ఱ్ఱాతఙ్గళ్ కழுవినర్
నితియు నఱ్ఱుణ్ణము ని త్తెకుడ విళక్కుముమ్
మతిముకమడన్దైయు రేన్దినర్ వన్దే.

తా॥ మన భాగ్యముచేతను ప్రవేశించిరని విలక్షణులై వేదమందు ప్రతిపాదింపబడిన నిత్యసూరులు తమ తమ స్థానములయందు పచార పూర్వకముగా పాదములను కడిగినారు. నిధివలెనున్న శ్రీశఠకోపమును మంచి శ్రీచూర్ణమును పూర్ణకుంభములను దీపములను చంద్రుని వంటి ముఖములుగల స్త్రీలు యెదురుగా వచ్చి ధరించిరి.

పె. తి. మొ. 4 ప. 3 తి. 1 పా.

పా॥ పేరణిన్దులకత్తవర్ తొழுతేత్తుమ్ పేరరుళాళ నెమ్బిరానై
వారణిములై యాళ్ మలర్మకళోడు మణ్మకళుముడన్ నిఱ్ప
శీరణిమాడనాఙ్గైన న్నడువుళ్ శెమ్బొన్ శెయ్ కోయిలినుళ్ళే
కారణిమేకమ్ నిన్ఱతొప్పానై క్కణ్డుకొణ్డుయ్న్దొழிన్దేనే.

తా॥ లోకమందున్నవారు గొప్ప సంఘముగా చేరి యాశ్రయించి స్తోత్రముజేయు మహాకృప గలవాడును వర్షకాలమందు సుందరమైన

మేఘముతో సమానమైనవాడును మా కుపకారకుడును నగు స్వామిని రవికచేత నలంకరించబడిన స్తనములుగలదైన పద్మమం దనతరించిన లక్ష్మీదేవితోకూడా భూదేవియునుకూడ నుండగా సం పదగల సుందరమైన మేడలుగల తిరునాఙ్గూర్‌యందు నట్టనడుమ నున్న శెమ్బొన్‌శెయ్ కోయిలనెడి దివ్యదేశమందు సేవించి యుజ్జీ వించి విడచితిని.

తి. వా. మొ. 5 ప. 9 తి. 7 పా.

పా॥ పాదఙ్గళ్‌మే లణిపూన్దొళకూ్కడుఙ్గొ ళ్వావైనల్లీర్
ఓతనెడున్దడత్తుళియన్ తామరై శెఙ్గళునీర్
మాతర్‌కణ్ వాణ్ముకము ఙ్గణ్ణుమేన్దు న్దిరువల్లవాళ్
నాతనిఞ్ఞాలముణ్డ నమ్బిరాన్తన్నై నాడొఱుమే.

తా॥ సముద్రమువలె గొప్పవైన తటాకములయందు వృద్ధిపొంది యున్న తామరపుష్పములును ఎఱ్ఱకలువలును స్త్రీలయొక్క సుందర మైన ముఖములను నేత్రములను ధరించియున్న తిరువల్లవాళ్‌యందు వేంచేసియున్న స్వామియును యీభూమిని భుజించిన మన కుపకారకు డును నైన శ్రియఃపతిని ప్రతిదినమును ప్రతిమలవంటి విలక్షణులైన వారలారా! పాదములపై నలంకరించిన పుష్పములను సేవించుటకు సంభవించునా?

తి. వా. మొ. 9 ప. 9 తి. 4 పా.

పా॥ పావియేన్మనత్తేనిన్ఱిడుమాలో వాడై తణ్వాడైయాలో
మేవుతణ్మతియమ్ వెమ్మతియమాలో మెన్మలర్ పళ్ళి
వెమ్పళ్ళియాలో

తూవియమ్బుళ్ళుడై త్తియ్వవణ్డు తుత్తైన్ద వెమ్పెన్నాయ
మ్బావితాలో
ఆవియిన్ పరమల్లవ్లైకళాలో యామ్బుడై నెఞ్జము
న్దుకైయన్దాలో.

తా॥ పాపాత్ములాలనైన నామనస్సునందుండి ఉత్తరపుగాలి చీల్చి వేయుచున్నది. అయ్యో! చల్లని యుత్తరపుగాలి వేడిగాలి యగుచున్నది. అయ్యో! ఆశపడదగిన చల్లని చంద్రుడును వేడిచంద్రుడగుచున్నాడు. అయ్యో! మృదువైన పుష్పపర్యంకము యగ్నిపర్యంకమగుచున్నది. అయ్యో! సుందరమైన రెక్కలుగల గరుత్మంతుని వాహనముగాగల పరదేవత యనెడి తుమ్మెదచేత త్రొక్కివేయబడిన మా స్త్రీత్వ మనెడి సుందరమైన పుష్ప మిది. అయ్యో! బాధకవస్తువులయొక్క ప్రకారములు ఆత్మమాత్రమైనవి కావు. అయ్యో! మాయొక్క మనస్సును సహాయముకాదు. అయ్యో!

తి. వా. మొ. 10 వ. 9 తి. 11 పా.

పా॥ వన్దవ రెతిర్కొళ్ళ మామణిమణ్డపత్తు
అన్దమిల్ పేగిన్బత్తడియరో డిరున్దమై
కొన్దలర్ పొఴ్ఴిల్ కురుకూర్ శడకోపన్ శొల్
శన్దజ్గళాయిర త్తివైవల్లార్ మునివరే.

తా॥ ఆ శ్రియఃపతివచ్చి యెదురుకొనగా తిరుమామణి మంటపమందవధిలేని గొప్పానందముగల భక్తులైన నిత్యసూరులతోకూడానున్న విధమును పుష్పగుచ్ఛములు వికసించుచున్న తోటలుగల తిరునగరికి నిర్వాహకులైన నమ్మాళ్వార్లు సాయించిన వేదస్వరూపములైన వేయి పాశురములలో నీ పది పాశురముల నభ్యసించువారు భగవద్గుణముల ననుభవింతురు.

తి. నె. దా. 14 పా.

పా॥ ముళైక్కదిరై క్కుఱుజ్గుడియుళ్ ముకిలై
మూవామూవులకుం కడన్దప్పాల్ ముతలాయ్ నిన్ఱ
వళప్పరియ వారముతై వరజ్గమేయ
వన్దణనై యన్దణర్ తమ్ శిన్దైయానై.
విళక్కొళియై మరతకత్తై త్తిరుత్తణ్గావిల్
వెహ్కావిల్ తిరుమాలై ప్పాడక్కేట్టు
వళర్త్తతనాల్ పయన్ పెత్తేన్ వరుక నెన్ఱు
మడక్కిళియైక్కైకూప్పి వణజ్గినాళే॥

తా॥ బాలసూర్యునివంటివాడును, తిరుక్కుఱుజ్గుడియందు వేంచేసియున్న మేఘమువంటివాడును, నశించని మూడులోకములను దాటియాపైని కారణమైయున్న పరిచ్ఛేదించుటకు శక్యముగాని పూర్ణమైన యమృతమువంటివాడును, శ్రీరంగమందు వేంచేసియున్న పరిశుద్ధుడును, బ్రాహ్మణులయొక్క మనస్సునం దున్నవాడును, దీపమువంటి ప్రకాశముకలవాడును, మరకతమువంటివాడును, తిరుత్తణ్గాయందు వేంచేసియున్నవాడును, తిరువెహ్కాయందు నిద్రించిన శ్రియఃపతిస్నీ యైనవానిని నాడియాడగా విని పెంచుటచేతను ప్రయోజనమును లభించితిని అనిభవ్యమైన చిలుకను చేతులు జోడించి నమస్కరించినది.

పెరి. తి. మొ. 3 ప. 6 తి. 3 పా.

పా॥ వానిళవరశు వైకున్దక్కుట్టన్ వాశుతేవన్ మతురై మన్నన్ నన్దర్
కోనిళవరశు కోవలర్ కుట్టన్ కోవిన్దన్ కుఝల్ కోడూతినపోతు

వానిళమ్పడియర్ వన్దువన్ది మననురికిణ్ణి మలర్ కణ్గళ్ పనిప్ప
త్తేనళవు శెఱికూన్దలవిఙ్గ చ్చెన్ని వేర్పచ్చెవి శేర్త్తు నిన్ఱనరే.

తా॥ పరమపదమునకు యువరాజును, వైకుంఠమందలి చిన్నపిల్ల వాడును, వసుదేవుని కుమారుడును, మధురాపట్టణమునకు రాజును, నందగోపునియొక్క యువరాజును, గోపాలురయొక్క పిల్లవాడును, గోవిందుడును నైనవాడు పిల్లనగ్రోవును పుచ్చుకొని యూదినప్పుడు దేవలోకమందు నివసించుచున్న యువతులైన స్త్రీలు వచ్చి వచ్చి సంక్షోభవించి మనస్సుకరిగి పద్మములవంటి నేత్రములనుండి యానంద బాష్పములు స్రవించగా తేనెతోకూడిన సాంద్రమైన కొప్పులు విడగా ఫాలభాగము చెమర్చగా చెవులను చేర్చి నిలచినారు.

తి. వా. మొ. 10 ప. 7 తి. 1 పా.

పా॥ శెఙ్గో ట్కవికాళుయిర్ కాత్తాట్చెయ్ మిన్ తిరుమాలిరుఞ్జోలై
వఞ్జక్కళ్వన్ మామాయన్ మాయక్కవియాయ్ వన్దు. ఎ
న్నెఞ్జ ముయిరుముళ్ కలన్దు నిన్ఱారఱియావణ్ణమ్. ఎ
న్నెఞ్జముయిరు మవ్వైయుణ్డు తానేయాకి నిఱైన్దానే.

తా॥ తిరుమాలిరుఞ్జోలైయందు వేంచేసియున్న వంచకుడైన దొంగ వాడును గొప్ప యాశ్చర్యభూతుడును నగు సర్వేశ్వరుడు కృత్రిమ కవియై వచ్చి నా మనస్సునందును, ఆత్మయందును కలసియుండి ప్రక్కనున్న పిరాట్టిమార్లుకూడా నెఱుగని ప్రకారముగా నామన స్సును ఆత్మను యనుభవించి తానే యభిమానియై పూర్ణుడాయెను. ఋజువైనశబ్దములు గల కవులారా! మీ ఆత్మను రక్షించుకొని కైంకర్యము చేయండి.

తి. వా. మొ. 6 ప. 5 తి. 5 పా.

పా॥ కుఴైయుమ్ వాణ్ముకత్తేఴైయై తులైవిల్లిమఙ్గలఙ్గొణ్డు పు
క్కిఴైకొళ్ శోతి చ్చెన్దామరైక్క ట్పిరానిరున్దమై కాట్టినీర్
మఴైశెయ్ తా లొక్కణ్ణీరినొడన్ఱుతొట్టు మైయాన్దివళ్
నుఴైయు శ్చిన్దైయళన్నైమీర్ తొఴుమత్తిశై
యుఱ్ఱునోక్కియే.

తా॥ శిధిలమయొడి కాంతిగల ముఖముగల చపలురాలైన యీామెను తులైవిల్లిమంగళమునకు తీసుకొనిపోయి ప్రవేశించి యాభరణములచే గలిగిన తేజస్సును, ఎఱ్ఱతామరపుష్పములవంటి నేత్రములును గల యుపకారకుడు వేంచేసియున్న విధమును కనపరచినారు. తల్లులారా! నాడు మొదలు యీామె వర్షధారలవంటి కన్నీళ్ళతో భ్రమించి యువ గాహించుచున్న మనస్సుకలదై యాదిక్కును యేకాగ్రముగా జూచి నమస్కరించును.

తి. వా. మొ. 10 ప. 8 తి. 10 పా.

పా॥ ఉఱ్ఱేనుకన్దు పణిశెయ్తు నపాతమ్
పెఱ్ఱేనీతే యిన్నమ్ వేణ్డువతెన్దాయ్
కఱ్ఱార్ మఱైవాణర్కళ్ వాఴ్తిరుప్పేరా
అఱ్ఱారడియార్ తమక్కల్లల్ నిల్లావే.

తా॥ నిన్ను పొందితిని. సంతోషించి కైంకర్యమును జేసి నీపాదములను పొందితిని. మా స్వామీ! ఇదియే యింకను కావలసినది. అభ్యసించిన వేదములకు నిర్వాహకులైనవారు నిత్యవాసము జేయుచున్న

తిరుప్పేర్ యందు వేంచేసియున్నవాని కనన్యార్హ శేషభూతులగు దాసులకు దుఃఖములు నిలువవు

తి వా మొ 2 ప 5 తి 8 పా

పా॥ పొన్నుడియమ్మ్మేఱ్ఱై యెమ్మానై నాఙ్ గడన్దోళ్
తన్ముడివొన్ఱిల్లాత తణ్డుళాయ్ మాలైయనై
ఎన్ముడివుకాణాదే యెన్నుళ్ కలన్దానై
చ్చొన్ముడివుకాణేన్నాన శొల్లువతెన్ శొల్లీరే

తా॥ బంగారు కిరీటముగల సుందరమైన యుద్ధవృషభమువంటి వానును, మా స్వామియును, నాలుగైన గొప్పభుజములు గలవాడును, తన కంతములేని చల్లని తిరుత్తుళాయ్ మాలికగలవాడును, నా నీచతను చూడకనే నా మనస్సునందు కలసినవాడును నైన సర్వే శ్వరుని నేను చెప్పెడి రీతి నెఱుగను చెప్పున దేమి? చెప్పండి

నాయ్ తి మొ. 5 తి 11 పా

పా॥ విణ్ణుఱనీణ్డడి తావియమైన్దనై వేఱ్ఱుణ్ మడన్దై విరుమ్బి
కణ్ణుఱ వెన్ కడల్వణ్ణనై క్కావుకరుఙ్గుయిలే యెన్దమాఙ్ గమ్.
పణ్ణుఱు నాన్మఱైయోర్ పుదువై మన్నన్ పట్టర్పిరాన్
కోదైశొన్న
వణ్ణుఱు వాశకమాలై వల్లార్ నమోనారాయణాయ వెన్బారే

తా॥ బల్లెమువంటి నేత్రములు గలదియై స్త్రీత్వపూర్తి గలదియై స్వాం ప్రధానమైన నాలుగు వేదముల నభ్యసించినవారు వర్తించుచున్న శ్రీవిల్లిపుత్తూర్ కు నిర్వాహకులైన పెరియాళ్వార్ కుమార్తెయైన గోదాదేవి యాకాశమునంటునట్లు దీర్ఘమైయున్న తిరువడికళ్ళచే

మూడు లోకములను కొలచుకున్నవానిని యాదరించే నల్లని కోకిలా! సముద్రవర్ణుని నా నేత్రములకు గోచరమగునట్లు పిలువుమనిన మాటగా చెప్పిన తగిన వచనమాలికలైన యీ పాశురముల నభ్యసించుటకు సమర్థులైనవారు నమో నారాయణాయ యందురు.

ఇయత్పా. 1 తి. 95 పా.

పా॥ నావాయిలుణ్డే - నమోనారణావెన్డు
ఓవాతురైక్కు మురైయుణ్డే - మూవాత
మాక్కతిక్కణ్ శెల్లుమ్వకై యుణ్డే - ఎన్నొరువర్
తీక్కతిక్కణ్ శెల్లుమ్ తిఱమ్.

తా॥ నాలుక నోటియందున్నదే. నమో నారాయణా యని విచ్ఛేదము లేకుండా చెప్పెడి తిరుమంత్ర మున్నదే. పునరావృత్తి లేని శ్రేష్ఠమైన మార్గమందు వెళ్ళెడి యుపాయ మున్నదే. ఒకరు దుష్ట మార్గమునందు వెళ్ళెడి ప్రకార మేమి?

తి. వా. మొ. 8 ప. 1 తి. 10 పా.

పా॥ తాళ్కళై యెనక్కేతలై తలైచ్చిఅప్ప త్తందపేరుతవి
కైమ్మాఱా
తోళ్కళై యార త్తుழுవి యెన్నుయిరై యఱవిలైశెయ్త
నన్శోతీ.
తోళ్కళాయిరత్తాయ్ ముడికళాయిరత్తాయ్
తుణైమలర్క్కణ్గళాయిరత్తాయ్
తాళ్కళాయిరత్తాయ్ పేర్కళాయిరత్తాయ్ తమియనేన్
పెరియవప్పనే.

తా॥ తిరువడి కళ్ళను నాకే పైపైని పరిపూర్ణముగా నిచ్చిన గొప్ప ఉపకారమునకు ప్రత్యుపకారముగా నా యాత్మను భుజములు నిండే టట్టుగా కౌగలించుకొని శుద్ధక్రయమును చేసితిని తేజస్స్వరూపుడా! భుజములు వేయి గలవాడా! శిరస్సులు వేయి గలవాడా! జోడైన పుష్పములవంటి నేత్రములు వేయి గలవాడా! తిరువడికళ్ళు వేయి గలవాడా! తిరునామములు వేయి గలవాడా! ఒంటరియైన నాకు గొప్ప ఉపకారకుడవైన స్వామీ!

తి వా మొ 9 ప 6 తి 1 పా

పా॥ ఉరుకుమాల్ నెఞ్జ ముయిరిన్ పరమన్ఱి
పెరుకుమాల్ వేట్కై-యు మెన్ శెయ్ కేన్ తొణ్డనేన్
తెరువెల్లామ్ కావికమ్ఱ్ తిరుక్కాట్కరై
మరువియ మాయన్ఱన్ మాయనినై తొఱే

తా॥ వీధులయం దెల్లను నల్లకలువపుష్పములు పరిమళించుచున్న తిరుక్కాట్కరైయందు వేంచేసియున్న యాశ్చర్యభూతుని యొక్క యాశ్చర్యచేష్టితములను తలంచినప్పు డంతయు మనస్సు కరుగు చున్నది యాశ్చర్యము ఆత్మకు భరముకాకుండా నభిని వేశము పెరుగు చున్నది యాశ్చర్యము చపలుడనైన నే నేమి చేసెదను?

తి వా మొ. 8 ప 1 తి 8 పా

పా॥ మణన్దపేరాయా మాయత్తాల్ ముழுతుమ్ వల్వినై యేనై
యీర్కిన్ఱ
కుణఙ్గళై యుడైయా యశురర్ వన్నైయర్ కూఱ్ఱమే
కొడియపుళ్ళుయర్త్తాయ్

వణజ్గళాయిరముడై యవైన్నాకప్పళ్ళియాయ్
పాఱ్కడల్ శేర్పా
వణజ్గుమాఅటియేన్ మనముమ్ వాళకము శ్జాయ్కై యుం
యాను నీతానే.

తా॥ ఆశ్చర్యచేష్టితములచే సకల పదార్థములను సంశ్లేషించిన గొప్ప గొల్లవాడా! క్రూరమైన పాపముగల నన్ను చీల్చి వేయుచున్న కల్యాణగుణములు గలవాడా! బలిష్ఠమైన చేతులుగల యసురులకు మృత్యువైనవాడా! క్రూరుడైన గరుత్మంతుని ధ్వజముగా నెత్తిన వాడా! వేయి ఫణములుగల విశాలమైన శేషు డనెడి పడకగలవాడా! క్షీరసముద్రమందు పవ్వళించినవాడా! మనోవాక్కాయములును నేనును నీకే యధీనములు నిన్నాశ్రయించుట కుపాయము నెఱుగను.

తి. వా. మొ. 10 ప. 8 తి. 7 పా.

పా॥ ఉణ్డుకళిత్తేఱ్కుమ్బరెన్నుళై - మేలై
త్తొణ్డుకళిత్తన్దితొ ముఱ్జోల్లు ప్పెఱ్ఱేన్
వణ్డుకళిక్కుమ్ పొழిల్శూழ் తిరుప్పేరాన్
కణ్డుకళిప్ప కణ్ణుళ్ నిన్ఱకలానే.

తా॥ భ్రమరము లానందించుచున్న తోటలచే చుట్టువారు కొన బడిన తిరుప్పేర్ యందు వేంచేసియున్నవాడు నేను సేవించి యానం దించునట్లు నేత్రములయం దుండి యెడబాయకుండా నున్నాడు. అనుభవించి సంతోషించిన నాకు యికపైని యేమి లోపము? మేలైన దాస్య మధికమై యంతమందు చెప్పదగిన నమశ్శబ్దమును లభించితిని.

శ్లో॥ నమశ్శబ్దంప్రయుఞ్జతే (ఆకరము తెలియదు.)

తా॥ నమశ్శబ్దమును ప్రయోగించుచున్నారు.

తి. వా. మొ. 10 ప. 6 తి. 11 పా.

పా॥ కాట్టిత్తన్ కనైకழల్ కళ్ కడునరకమ్బుక లొழిత్త
వాట్టాత్ తెమ్బెరుమానై వళఙ్గురుకూర్ చ్చడకోపన్
పాట్టాయ తమిழ్మాలై యాయిరత్తు ళిప్పత్తు
మ్గేట్టారార్ వానవర్ కళ్ శెవిక్కినియ శెఙ్గాల్లే.

తా॥ తనయొక్క యాభరణధ్వనిగల తిరువడికళ్ళను కనపరచి క్రూరమైన నరకములను ప్రవేశించుటను విడిపించిన తిరువాట్టాఱుయందు వేంచేసియున్న స్వామినిగూర్చి సమృద్ధమైన తిరునకరికి నిర్వాహకులైన నమ్మాళ్వార్ల పాశురరూపముగా సాయించిన ద్రావిడ మాలికలైన వేయి పాశురములయందు చెవులకు భోగ్యమైన శ్లాఘ్యమైన శ్రీసూక్తియైన యీ పది పాశురములను నిత్యసూరులు విని తృప్తి జెందరు.

పె. తి. మొ. 5 ప. 8 తి. 4 పా.

పా॥ నఙ్జుళోర్వతోర్ వెఙ్జనవరవమ్ నెరువివన్దు నిన్ శరణెన
చ్చరణాయ్
నెఙ్జిల్ కొణ్డు నిన్నఙ్జెప్పఅవై కడైక్కలమ్కోడు
త్తరుళ్ శెయ్ తతఱిన్దు
వెఙ్జొలాళర్ కళ్ నమన్తమ రక్కడియర్ కొడియశెయ్వన
వుళవతక్కడియేన్
అఙ్జివన్దు నిన్నడియిణై యడైన్దే నణిపొழిల్
తిరువరఙ్గత్తమ్మానే.

అర్చిరాది ద్వితీయప్రకరణత్తిల్ ప్రమాణత్తిరట్టు సంపూర్ణమ్.

తా॥ సుందరమైన తోటలుగల శ్రీరంగమందు వేంచేసియున్న స్వామీ! క్రూరమైన మాటలు గలవారైన యమభటులు కఠినులు, క్రూరమైన చేసెడిపను లుంటున్నవి. దానికి దాసుడను భయపడి విషమును క్రక్కెడి యొక క్రూరమైన కోపముగల సుముఖు డనెడి సర్పము భయపడి వచ్చి నీ శరణ మనగా రక్షకుడవై మనస్సునందు గ్రహించి నీయొక్క సుందరమైన రెక్కలుగల గరుత్మంతునకు రక్ష్యవస్తువుగా యిచ్చి కృపజేసినది తెలిసికొనివచ్చి నీ తిరువడి ద్వయము నాశ్రయించితిని.

అర్చిరాది ద్వితీయ ప్రకరణమందలి ప్రమాణతిరట్టు
తాత్పర్యము సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః

# అర్చిరాది - తృతీయ ప్రకరణము

పిళ్ళై లోకాచార్యర్ తిరువడికళే శరణమ్.

1. ఉభయవిభూతియైయు న్త్రొత్తిలాక వకుప్పుణ్ణు సర్వాశ్చర్యమయ మాన (కోప్పుడైయ శీరియశిజ్గాసనత్తిలే.)

ఉభయవిభూతులనును చిత్తరువుగా నేర్పరచబడి సర్వాశ్చర్య మయమైన (శిల్పములుగల శ్లాఘ్యమైన సింహాసన ముండును.)

2. పన్నిరణ్డితళ్గాయ్ నానాశక్తిమయమాన దివ్యకమలమాయ్ అతిల్ దివ్యకర్ణికైయిలే పుష్పసంచయవిచిత్రమాన దివ్య యోగపర్యంకమాయ్.

దానిపై పన్నెండు రేకులై నానాశక్తిమయమైన దివ్యకమల ముండును. దాని దివ్యకర్ణికయందు పుష్పసమూహముచేత విచిత్ర మైన దివ్యయోగపర్యంక ముండును.

3. అతిన్మేలే యనేకమాయిరమ్ చంద్రర్కళై యురుక్కి వార్ త్తాప్పోలే కుళిర్న్ద పుకరైయుడైత్తాన తిరుమేనియై యుడైయ నాయ్.

దానిపైని యనేకవేల చంద్రులను కరిగించి పోసినట్టువలె చల్లనికాంతి గలదైన తిరుమేనిని గలవాడై.

4. కల్యాణగుణజ్గళు క్కన్తమిల్లామెయాలుమ్, సర్వవిధకైంకర్య త్తిలు మధికృతనాయ్ కైంకర్యపరర్క్కెల్లామ్ పడిమావా యిరుక్కైయాలుమ్ అనన్తనెన్డుమ్ శేషనెన్డుమ్ తిరునామ త్తైయుడైయనాయ్.

కల్యాణగుణముల కంతము లేకపోవుటచేతను, సర్వవిధకైంకర్యములయందును పూనుకున్నవాడై కైంకర్యపరుల కందఱకు నుపమానమై యుండుటచేతను అనన్తు డనిన్నీ శేషుడనిన్నీ తిరునామము గల ఆదిశేషు డమరియుండును. ఆయనకు

5. భగవదనుభవత్తుక్కు పోక్కువీడాక పలవాయ్ తలైకళై యుముడైయనాయ్

భగవదనుభవమును వెలిబుచ్చుట కనేకమైన నోళ్లను తలలును గలవు. ఆయన

6. విజ్ఞానబలంగళుక్కుమ్ శైత్య మార్దవ సౌరభ్యాదిగుణఙ్గళుక్కుమ్ కొళ్ కలమాన తిరువనన్తాళ్వానాకిఱ పడుక్కైయిలే

విజ్ఞానబలములకును శైత్య మార్దవ సౌరభ్యాదిగుణములకును పాత్రమైనవారు. అట్టి తిరువనన్తాళ్వా ననబడుపడకయందు

7. రజతగిరిశిఖరత్తిలే యనేకమాయిర మాదిత్యర్కళ్ శేర వుతిత్తాప్పోలే యిరుక్కిఱ ఫణామణ్డలఙ్గళిల్ జ్యోతిర్మణ్డలత్తిన్నడువే

వెండికొండ శిఖరమందు అనేకవేల సూర్యులు చేరి యుదయించినట్టువలె నున్న ఫణామండలములయందలి జ్యోతిర్మణ్డలము యొక్క మధ్యను

8. (పతింవిశ్వస్య) ఎన్గిఱవనుక్కుమ్ తన్ పూర్త్తియాలే పొపుఱిఱ న్తడవవేణ్డుమ్పడియాన పూర్త్తియైయుమ్,

ప్రపంచమున కధిపతికూడా తన పూర్తిచేతనే పూర్తి చేసుకొనవలసిన పూర్తినిన్నీ

9. (వాశ శ్జ్వయ్ పూఙ్గుప్పలాళ్) ఎన్గిఱపడియే నాఱ్ ఱత్తక్కుమ్.
నాఱ్ ఱమ్ కట్టలాప్పుడియాన పూఙ్గుప్పలై యుమ్.

(పరిమళమును కలుగజేయు పుష్పములుగల కేశపాశముగలది) అనునట్లు పరిమళమునకుకూడా పరిమళము నొసంగు సుందరమైన కేశపాశమును.

10. పుణ్డరీకాక్షనై యుమ్‌కూడ క్కుడసీర్ వార్ప్పిత్తుక్కొణ్డు వొరు మూలై యిలే కుమిఴ్గినీరూట్టుమ్పడియాన (వడిక్కోలవాళెడుం కణ్గళై) యుమ్.

పుణ్డరీకాక్షునికూడా కుండతో నీళ్లు పోయించుకొని (సేవ చేయించుకొని) ఒకమూలయందు బుడగల నీరు త్రాగించే (ఉక్కిరి బిక్కిరి చేయుచు) తనయందు మగ్నుడయే ట్టు చేసుకొనే ప్రకారమైన) (వడకట్టిన సౌందర్యమును కాన్తియునుగల విశాలమైన నేత్రములను,

11. భోగత్తుక్కే కాన్తమాన వొప్పనై ప్పోలే బాల్యమధ్యత్తిలే మెయ్ కాట్టుకిఱ యౌవనత్తైయుమ్,

భోగమున కవశ్యాపేక్షితమైన యలంకారమువలె బాల్య యౌవనములమధ్యయందున్న యౌవనమున్నూ.

12. పేశప్పిళకుమ్పడి యాన సౌకుమార్యత్తైయుమ్,
చెప్పినంతనే కందిపోయే ప్రకారమైన సౌకుమార్యమునున్నూ.

13. (పిత్తర్ పనిమలర్ మేఱ్పావైక్కు) ఎన్గిఱపడియే అల్లాతవర్ కళ్ పక్కల్ పోల్త్తేనూల్ పిడిత్తు ప్పరిమాఱవొట్టాత భోగ్యతా ప్రకర్షత్తైయుమ్.

(చల్లని పద్మమండలి ప్రతిమవంటి లక్ష్మీదేవివిషయమందు వ్యామోహము గలవారు) అనునట్లుగా మిగిలిన దేవులపట్లనువలె శాస్త్రమును పట్టుకొని ప్రవర్తింపనీయని భోగ్యతాప్రకర్షనున్నా.

14. భోగోపోద్ఘాతకేళియిలే భగవద్వైశ్వరూపత్తై చ్చురాంగిక్కుం పడియాన వురుమైయుముడైయళాయ్.

భోగారంభక్రీడయందే భగవంతుని విశ్వరూపమును సంకోచింపజేసే మహిమకలదియై,

15. దివ్యపరిజనంగళై తత్తదవస్థానురూపమాకదివ్యపరిచర్యైయిలే నియోగియానిఱ్పాళాయ్ సర్వాత్మాక్కళుక్కుమెన్రుమొక్క చ్చార్వాయ్.

దివ్యపరిజనములను ఆయాయవస్థల కనురూపముగా దివ్యపరిచర్యయందు నియోగించుచున్నదియై సమస్తాత్మలకును నెప్పుడు సమానముగా నాశ్రయణీయమై.

16. శీలరూపగుణవిలాసాదికళాలే (తనక్కేఱ్క) మెన్రువ్వుడియిరుక్కిఱ (ఒళిన్దవొణ్మలరాళాన) పెరియపిరాట్టియార్వల వట్టత్తిలే యెళున్దరుళియిరుక్క.

శీలరూపగుణవిలాసాదులచేత నీకు తగినదిగానున్న (కృశించిన కాంతిగల కమలవాసినియైన) పెరియపిరాట్టిమార్ కుడిప్రక్కయందు వేంచేసియుండగా.

17. అవళిలుంకాట్టిల్ విఞ్జిన క్షమాదయాది గుణఙ్గళైయుమ్, నావాల్ తొడైక్కవొణ్ణాతవధ్రుకైయుముడైయవరాయ్ అవళుక్కు (నిధ్రుల్పొల్వరాన) మఱ్ఱై యిరణ్డునాయ్చ్చిమారు మిడవట్టత్తిలే సేవిత్తిరుక్క.

ఆమెకంటెను మించిన క్షమాదయాదిగుణములనున్నూ నాలుకచేత త్రొక్కుటకు వల్లగాని (నాలుకచేత చెప్ప శక్యముగాని) సౌందర్యమునున్నూ గలవారై యీ లక్ష్మీదేవికి (ఛాయవంటి వారైన) మిగిలిన యిద్దరు నాచ్చిమారులును యెడమప్రక్క యందు సేవించియుండగా.

18. ఇవర్ కళుక్కు నడువే మూన్దు మిన్ కొడికళోడే కూడి తామరై ప్పూత్తదొరు కాళమేకం వెళ్లిమలైయై క్కవియ ప్పడిన్దిరుక్కుమాప్పోలే (ముడిచ్చోతియా యునతు ముకచ్చోతి మలర్న్దతువో) ఎన్నిఅపడియే తిరుముకమణ్డలత్తి నొళివెళ్ళమానతు మేల్ నోక్కి క్కొప్పళిత్తాప్పోలేయాయ్.

వీరికి మధ్యను మూడు మెరుపుతీగలతోకూడి తామరలను పూచినదైన యొక నల్లని మేఘము వెండిపర్వతమును కబళీకరించు నట్లుగా నవగాహించి యున్నట్టువలె (నీయొక్క ముఖకాంతి కిరీటకాంతియై వికసించినదా?) అనుచున్న ప్రకారముగా తిరుముఖమండలముయొక్క కాంతిప్రవాహ మూర్ధ్వముఖముగా ప్రవహించునట్లుగానై

19. ఉభయవిభూతిక్కుమ్ నిర్వాహకనెన్దుమిడత్తై క్కోళ్ శొల్లిత్తరక్కడవతాయ్.

ఉభయ విభూతులకును నిర్వాహకు డనెడి అంశమును సూచింపదగినదై

20. తన్ పుకరాలే అల్లాతపుకరైయుడైయ ముట్టాడుక్కిఅ (విజ్ఞాతనాయకనీణ్ముడి) ఎన్గిఅ తిరువభిషేకత్తైయుమ్. కణ్డార్ కణ్ణుం నెఞ్జుమిరుళుమ్బడి యిరుండు శుభ్రన్దు అష్టమీచంద్రనిలే యమృతి

ధారై విట్టున్దాప్పోలే తిరునెత్రియిలేశాత్రిన తిరునామత్తై
మత్తైప్పతుకాట్టువతాయ్ కొణ్డు (అళైన్దు విళ్కిన్ద పూన్దణ్ణ
త్తాయ్ విరైనాఱు కిఱ) (నీలప్పనియిరుం కుఱ్ఱల్ కళైయుమ్.)

తనకాంతిచేత నితరకాంతుల నన్నిటిని మునుగు వేయుచున్న (పరమపదమునకు ప్రధాననాథుని దీర్ఘమైన కిరీటము) అనునట్టి కిరీటమునున్నూ, చూచువారి నేత్రములను మనస్సును చీకటిక్రమ్మునట్లుగా నల్లనై యుంగరములు చుట్టుకొని అష్టమీచంద్రునినుండి యమృతధార పడుచున్నట్టువలె ఫాలభాగమందు ధరించిన పుండ్రము నొకతరి యాచ్ఛాదించుచు, నొకతరి కనపరచునటుల చలించుచు (వికసించుచున్న పుష్పములు గల చల్లన తిరుత్తుత్తాయ్ పరిమళము పరిమళించుచున్న) (నల్లని చల్లని పొడవైన కుంతలములనున్నూ)

21. సౌకుమార్యాతిశయత్తాలే కురువేర్ పరమ్బినాప్పోలేయాయ్
(నయన్దార్కట్కునచ్చిరైయాన) తిరునెత్రియైయుమ్
సౌకుమార్యాతిశయముచేత చిరిచెమట చెమర్చినట్టువలెనై
(ఆశపడినవారిని బంధించుస్థావమనదగిన) ఫాలభాగమునున్నూ,

22. అలర్న్దుకళిర్న్దిరుక్కిఱ ఇరణ్డుతామరైప్పూవుక్కళై మతత్తాలే
యముక్కియాడుకిఱ యిరణ్డువణ్డోట్టుజ్ఞుపోలేయిరుక్కిఱ (తన్
కైచ్చార్ఙమతువేపోలప్పుకియ) తిరుప్పురువజ్ఞళైయుమ్.

వికసించి చల్లనైయున్న రెండు తామరపుష్పములను మదముచేత నణచి యాడుచున్న రెండు భ్రమరపంక్తులవలెనున్న (తన చేతియందలి శార్ఙ్గధనస్సువలె) సుందరమైన కనుబొమ్మలనున్నూ.

23. కలన్దుపిరిన్దవర్కళుక్కు (ఇణైక్కూత్రజ్ఞళాయ్) అల్లాతవర్
కళై (త్తాయాయళిక్కు) క్కుడవతాయ్.

సంశ్లేషించి విశ్లేషించినవారికి (రెండు మృత్యువులై), మిగిలిన వారిని (తల్లియై రక్షించ) వలసినవై.

24. చేతనర్ పక్కల్ వాత్సల్యాతిశయత్తాలుమ్ (శెయ్యాళాన) పిరాట్టియై యెప్పోతు మొక్కకటాక్షిక్కైయాలుమ్ ఉభయవిభూత్యైశ్వర్యత్తాలుమ్ శివన్దు.

చేతనులపట్ల వాత్సల్యాతిశయముచే (ఎఱ్ఱని వర్ణముగలదైన) పిరాట్టిని యెప్పుడును సమానముగా కటాక్షించుటచేతను, ఉభయ విభూత్యైశ్వర్యముచేతనున్నూ యెఱ్ఱనై.

25. (పతింవిశ్వస్య) ఎన్గిఱప్రమాణం వేణ్డాతపడి (అనైత్తులక ముడైయ వరవిన్దలోచననై) ఎన్గిఱపడియే సర్వేశ్వరత్వ చిహ్నమాయ్,

(పతింవిశ్వస్య) అనెడి ప్రమాణ మవసరములేకయే ఈతడు (సమస్తలోకములుగల యరవిన్దలోచను) డనుచున్న ప్రకారముగా సర్వేశ్వరత్వచిహ్నమై,

26. వేఱోరణికిల్ శెల్లవొట్టాతే తనక్కేయఱ్ ఱుత్తిరుమ్బడి పణ్ణి (తామరైక్కణ్ణనై విణ్ణోర్ పరవుమ్ తలైమకనై) ఎన్గిఱపడియే త్రిపాద్విభూతియైయుమ్, ఎఱుత్తువాజ్గి కూప్పిడుమ్బడి పణ్ణక్కడవతాయ్.

వేఱొకసౌందర్యమందు వెళ్ళనీయక తనకే యనన్యార్హమై తీరే ప్రకారముగాచేసి (తామరపుష్పములనంటి నేత్రములు గలవాడును నిత్యసూరులు స్తోత్రములుజేయు ప్రధాను) డనునట్లు త్రిపాద్విభూతినికూడా (తొమ్మిపై స్వామి పేరును వ్రాసుకొని) స్వాధీనమైనట్లుగా చేయవలసినవై.

27. కుళిర్న్దు శెవ్వి పెర్గు పెరియపెరుమాళ్ తిరుక్కణ్గళ్ పోలే (కరియవాకిప్పుడై పరన్దుమిళిర్న్దు శెవ్వరియోడి) (యిలజ్గొళిశేరరవిన్దంపోన్దు నీణ్డు) (మిథోబద్ధస్పర్ధ స్ఫురితశఫదీద్వంద్వలలితం గళాయ్)

చల్లనై శోభనుపొంది పెరియపెరుమాళ్ నేత్రములువలె (నల్లనివై ప్రక్కలకు వ్యాపించి కాంతిగలవై యెఱ్ఱని రేఖలు వ్యాపించి) (ప్రకాశించుచున్న కాంతి చేరియున్న పద్మములవలెనుండి విశాలమై) (పరస్పరము స్పర్ధకలవగుట త్రుళ్ళిపడుచున్న మత్స్యద్వంద్వమువలె మనోహరములై)

28. (అప్పుకోలక్కజ్కిళిమ్బినాల్ అడైయాళజ్గళాన) (తూతుశెయ్ కణ్గళైయుమ్)

(సుందరమైన సభ లేచిపోతే ఆయనవాళ్లైన) (దూతకృత్యమును చేసెడి నేత్రములనున్నూ)

29. (మాట్టుయర్ కఱ్పకత్తిన్ వల్లియో కొప్పున్దో వఱియేన్) ఎన్ఱు నిత్యసందేహజనకమాన (కోలనీళ్ కొడిమూక్కైయుమ్)

(సమీపమందున్నతమైన కల్పవృక్షముయొక్క లతయో చిగురో యెఱుగను) అని నిత్యసందేహజనకమైన (సుందరమైన దీర్ఘమైన లతవంటి ముక్కునున్నూ)

30. అతినుడైయ పల్లవోల్లాసమ్పోలే యిరుక్కిఱ దివ్యకపోలజ్గళైయుమ్.

దానియొక్క చిగుళ్ళయొక్క ఉదయమువలె నుంటూన్న దివ్యమైన గండస్థలములనున్నూ.

31. అతినుడైయ నవకుసుమమ్బోలే యాంయ్ (పన్నిలాముత్తన్నవక్క్ కతిర్ ముఱువల్ శెయ్ తు) ఎన్గిఱపడియే పూర్ణచంద్రన్ ముఱునిలావై చ్చొరిన్దాప్పోలే తిరుముకత్తినొళియై ప్రవహిక్కిఱ స్మితత్తైయుమ్.

దానియొక్క నూతనమైన పుష్పములో యనునట్లున్ను (దంతములనెడి ఆణిముత్యముల కాంతి వ్యాపించునట్లుగా మందహాసమును జేసి) అనునట్లున్ను పూర్ణచంద్రుడు పూర్ణమైన వెన్నెలను ప్రసరింప జేసినట్లున్ను నున్న దంతపంక్తియొక్క కాంతిని ప్రవహించుచున్న మందహాసమునున్నూ.

32. (కోలన్దిరళ్ పవళ్ళక్కొళున్దుణ్ణమ్బోలేయాంయ్) పేచ్చిల్ శెల్ల వొట్టాతే తెవాయ్ కళ్వ్యియిలే నీచ్చాంబడి పణ్ణి నట్టార్ క్రిలే తెప్పపటిప్పారైవ్వోప్పోలేయన భవపరికరమాన (శిన్దైయైక్క వర్న్ద) కూప్పిడుమ్బడి పణ్ణక్కడవతాంయ్ (కళ్వప్పణిమొళికళుక్కాకరమాన) తిరువధరత్తైయుమ్.

(సౌందర్యము సంఘీభవించియున్న పగడములయొక్క స్నిగ్ధమైన అండమువలెనై) వానినుండి వెలువడు మాటలను వినవలెననెడు కుతూహలము నడ్డివైచి ఒడ్డుయందే యీాదవలసిన ప్రకారముగా చేసి, నట్టేరునందు తెప్ప నపహరించువారివలె ననుభవ పరికరమైన (మనస్సు నపహరించి) మొఱపెట్టే ప్రకారముగా చేయునదై కృత్రిమమైన కపటభాషణములకు) ఆకరమైన తిరువధరమునున్నూ.

33. (ఇలకు విలకు మకరకుండలత్తన్) ఎన్గిఱపడియే ప్రీత్యతిశయత్తాలే శిరఃకమ్పనప్పణ్ణుకైయాలే యశైన్దుదిగన్తజ్గళిలే ముట్టి

తేజస్సాలై యెరిన్దు లావణ్యసాగరత్తిలే యేఱిత్తుళ్ళుగిఱ (మిన్ను మామణి మకరకుణ్డలఙ్గళైయుమ్.)

(అత్యుజ్జ్వలమై చలించుచున్న మకరకుండలములు గలవాడు) అనునట్లుగా ప్రీత్యతిశయముచేతను శిరఃకమ్పనము చేయుటచేతను కదులాడి దిగంతములను తాకి తేజస్సు తరంగించి లావణ్యసాగరమం దెక్కి త్రుళ్ళుచున్న (ప్రకాశించుచున్న గొప్పవైన మణిఖచితమైన మకరకుండలములనున్నూ.)

34. కాన్తి శైత్య మార్దవ సౌరభ్యాది గుణఙ్గళాలే (శుఱ్ఱుం మొళి పట్టంశూఴ్న్దు) ఎన్నిఱపడియే సకలకలాపరిపూర్ణమాయ్ సర్వాహ్లాదకరమాయ్ మఱుక్కుఴఱ్ఱిన చంద్రమణ్డలత్తైయుమ్ అప్పోతలర్న్ద శెన్దామరై ప్పూవైయుమ్ తోఱ్పిక్కక్కడవతాయ్ కిట్టినారై ప్పిచ్చేఱ్ఱి (మైయలేఱ్ఱి మయక్కుమ్ మాయమందిరమాన) (కోళిళై వాణ్ముకత్తైయుమ్.

కాంతి చల్లతనము మార్దవము పరిమళము మొదలగు గుణములచేత (అన్నివైపులను కాంతిమండలము చుట్టువారుకొని) అనుచున్న ప్రకారముగా సకలకలాపరిపూర్ణమై సర్వాహ్లాదకమై కళంకమును తీసివేసిన చంద్రమండలమునున్నూ అప్పుడు వికసించిన యెఱ్ఱతామరపుష్పమునున్నూ ఓడించునదై, సమీపించినవారిని పిచ్చెత్తించి (మోహింపజేసెడి మాయ మంత్రమైన) (తనకాంతియే తనకాభరణముగాగల సుందరమైన ముఖమునున్నూ)

35. వాయ్చ్చిమాఱుదైయ హస్తాభరణంగళాలే ముద్రితమాయ్ (క్రముక తరుణ గ్రీవా కంబుప్రతిమమాన) తిరుక్కుఴుత్తైయుమ్.

నాచ్చిమార్ల యొక్క హస్తాభరణములచేతను ముద్రితమై (లేత పోకచెట్లయొక్క కంఠముతోను శంఖముతోను సమానమైన) కంఠమునున్నా.

86. నాచ్చిమారుడై య తిరుచ్చెవిప్పూక్కళాలుమ్ కర్ణభూషణ ఙ్గళాలుమ్ వికసితమానతిరుక్కుళల్ కర్నై యాలుముణ్డాన విమర్దత్తాలే (సీతాయాః శోభితమ్) ఎన్గిఅపడియే యలంకృతం గళాయ్ ఇరణ్డట్టత్తిలుమ్ మరకతగిరియై క్కడైన్దు వడుత్తా ప్పోలే తిణ్ణియవాయ్ ఉభయవిభూతియైయుమ్, తన్నిళలిలే యిట్టు నోక్కక్కడవతాయ్ కణైయత్తుక్కుళ్ళే యిరుప్పారై ప్పోలే తన్నై యడైక్కొళ్ళుకై యాలే సంసారత్తిలే యిరుక్క చ్చెయ్ తేయుమ్ నిర్భయనామ్పడి పణ్ణి (అలమ్పురిన్ద) ఎన్గిఅ పడియే తనక్కు వృథయవిభూతియైయుమ్ వళఙ్గి (దివ్యాస్త్ర పుష్పితఙ్గళా) యిరుక్కిఅ (కల్పకావెన నల్పల తోళ్కళై యుమ్.)

నాచ్చిమార్లయొక్క కర్ణభూషణములచేతను వికసించిన దైన కేశపాశముచే కలిగిన విమర్దముచేతను (సీతాదేవియొక్క ప్రకాశించుచున్న) అలంకరించబడినవై రెండుప్రక్కలయందును మరకతపర్వతమును సానపట్టి ఉంచినట్టువలెనున్న దృఢమైనవియు ఉభయవిభూతులనుకూడ తన నీడయందు పెట్టుకొని రక్షించదగి నవియు, కోటలోపల నున్నవారువలె తన నాధారముగా స్వీకరించు టచే సంసారమందున్నను భయములేనివారయే ప్రకారముగా చేసి (చాలునవేట్టుగా నిచ్చెడివి) అన్నట్లు తనకు ఉభయవిభూతులును స్వాధీనమై (దివ్యమైన అస్త్రములచే పుష్పించినవో యనునట్లున్న) (కల్పవన మనదగిన విలక్షణమైన యనేక భుజములనున్నా)

37. పెరియపిరాట్టియార్కు కోయిల్ కట్టణమాయ్ నిత్యానుభవమ్ పణ్ణానిఱ్కుచ్చెయ్ తేయుమ్ (ఇఱైయు మకలకిల్లేన్) ఎన్ను మ్బడి పిచ్చేఱ్ఱుక్క డవతాయ్ అవళ్ తిరువడికళిల్ శాఱ్ఱిన శెమ్బఞ్జుఴమ్బాలుమ్ శ్రీభూమిపిరాట్టియారుడైయ (కొంగై మేల్ కుఙ్కుమత్తిన్ కుఴమ్బాలుమ్, అలంకృతమాయ్ వనమాలావిరాజితమాయ్ పెరియపిరాట్టియార్కు హిరణ్య ప్రాకారమాన (కోలమామణియారముం ముత్తుత్తామముం) శ్రీకౌస్తుభంతుడక్కమాన (కురుమామణిప్పూణ్ కులావి తికఴుకిఱ) వఴుకియ తిరుమార్వైయుమ్.

పెరియపిరాట్టిమార్ల కంతఃపురమై నిత్యానుభవము చేయు చున్నప్పటికిన్నీ (క్షణ కాలమైనను విశ్లేషించజాలను) అనేప్రకార ముగా పిచ్చెత్తించునదై యామె తిరువడికళ్ళయందు ధరించిన లత్తుక పంకముచేతనున్నూ శ్రీభూదేవియొక్క (స్తనము పై ధరించిన కుంకుమపంకము చేతనున్నూ) అలంకరించబడినదై, వనమాల చేత ప్రకాశింపజేయబడుచున్నదై, పెరియపిరాట్టిమార్లకు బంగారు ప్రాకారమై (సుందరమై గొప్పదైన మణిహారమున్నూ) కౌస్తుభము మొదలైన (శ్రేష్ఠమై శ్లాఘ్యమైన మణిఖచితమైన ఆభరణము కదులాడి ప్రకాశించుచున్న) సుందరమైన వక్షస్థలమునున్నూ.

38. కాళమేకత్తిలే మిన్ కొడి పడర్ న్దాప్పోలే తిరుమేనిక్కు పరభాగ రసావహమాయ్, అఴకు వెళ్ళత్తు క్కణైకట్టినాప్పోలే యిరుక్కిఱ (వెణ్బురినూలైయుమ్)

నల్లని మేఘమందు మెరుపుతీగ వ్యాపించినట్లువలె తిరుమేని కలంకార రసమును కలుగజేయుచున్నదై సౌందర్యప్రవాహమున కడ్డుకట్టిన ట్లున్న (తెల్లని యజ్ఞోపవీతమునున్నూ)

39. (ఉళ్ళత్తుళ్ నిన్రులాకిన్ఱతే) ఎన్గిఱపడియే నిత్యముక్తరుడైయ తిరువుళ్ళజ్గళిలే యఴకు శెన్దేఱుకిఱ (తిరువుతరబన్ధత్తైయుమ్)

(హృదయమందుండి సంచరించుచున్నది) అనుచున్న ప్రకారముగా నిత్యముక్తులయొక్క తిరువుళ్ళములయందు సౌందర్యమును (బంతియాడుచున్న) గంతులిడ చేయుచున్న (తిరువుదరబంధము నున్నూ)

40. సౌందర్యసాగర మిట్టళప్పట్టు చ్చుఴిత్తాప్పోలే నెఞ్జైయుమ్ కణ్ణైయుమ్ శుఴియాఱుపడుత్తుకిఱ తిరువున్దియైయుమ్.

సౌందర్యసాగరము, సంకుచితస్థలమందు పడి సుడితిరిగినట్లు మనస్సును, నేత్రములను సుడిలో పడవేయుచున్న తిరునాభినిన్నీ.

41. శ్రీపాఞ్చజన్యత్తైయుం తిరువాఴియైయుమ్ చంద్రాదిత్యర్ కళాకక్కరుతి (అజ్గు మలరుం కువియుం) ఎన్గిఱపడియే అలరువతు కువివితాయ్ విధిశివనిధానమాన నాభీపద్మత్తైయుమ్.

శ్రీపాంచజన్యమును చక్రమును చంద్రసూర్యులుగా తలంచి (అచ్చట వికసించును ముకుళించును) అనుచున్న ప్రకారముగా వికసించుచు ముకుళించుచునున్న బ్రహ్మరుద్రులకు స్థానమైన నాభీపద్మము నున్నూ.

42. (తుడిశేరిడైయైయుమ్) సంధ్యారాగరంజితమాన ఆకాశం బోలే యిరుక్కిఱ తిరువరైక్కు పరభాగరసావహమాయ్ తిరువరైప్పూత్తాప్పోలే యిరుక్కిఱ (అన్దిపోల్ నిరత్తాడైయుమ్)

(డమరుకముపంటి నడుమునున్నూ) సంధ్యారాగముచేత రంజితమైన ఆకాశమువలె నున్న నడుమునకు పరభాగరసమును కలుగ

జేయుచున్నదై, నడుము పూచినదో యనునట్లున్న (సంధ్యవంటి కాంతిగల వస్త్రమునున్నూ)

43. (రమ్భాస్తంభాది) గంభిరమాన తిరుత్తుడై కళైయుమ్.

(అరటిస్తంభములు మొదలగువాటివలె) గంభీరమైన తొడలనున్నూ.

44. తామరై నాళంపోలే కంటకితంగళాన తిరుక్కణై క్కాల్కళై యుమ్.

తామర కాడవలె గగుర్పాటుగల పిక్కలనున్నూ.

45. (శంఖ రథాంగ కల్పక ధ్వజారవిన్దాఙ్కుశ వజ్రలాఞ్ఛనమాయ్) నాయ్చ్చిమారుంకూడ కూశిత్తొడవేణ్డుమ్బడి యత్యన్తమృదుక్కళాయ్ (తేనే మలరుం) ఎన్గిఅపడియే నిరతియభోగ్యంగళాన (తుయరఱు శుడరడికళై యుమ్)

(శంఖ చక్ర కల్పక ధ్వజారవిందాంకుశవజ్రరేఖలచేత చిహ్నితములై) నాయ్చ్చిమారులుకూడా సంకోచించి స్పృశించవలసిన మిక్కిలి మృదువైనవై (మకరందమునే ప్రవహించుచున్న) అనుచున్నప్రకారముగా మిక్కిలి భోగ్యములైన (దుఃఖచ్ఛేదకమైన) తిరువడికళ్ళనున్నూ,

46. లావణ్యసాగరత్తినుడైయ తిరై యెழுన్దుపోలే యిరుక్కిఱ తిరువిరల్కళై యుమ్

లావణ్యసాగరముయొక్క తరంగపంక్తివలెనున్న వ్రేళ్ళనున్నూ

47. అతిలే యనేకచంద్రర్కళ్ తోన్ఱినాప్పోలే యిరుక్కిఱ దివ్యనఖంగళై యుమ్

దానియందు దనేక చంద్రు లుదయించినట్లువలెనున్న దివ్యనఖములనున్నూ

48 వైరవురుక్కాయ్ ఆణ్ణైయుమ్ పెణ్ణైయుగుత్తి బంధుక్కళోట వఱుత్తు నాట్టై ప్పకై విళైత్తు (శేఙుయర్ వానత్తిరుక్కుం తేవపిరాన్ఱన్నై కుతియాయ్ మడలూర్ తుమే) ఎన్ఱిఅపడియే కణ్డాప్పోతే కైయ్యం మడలుమాయ్ కొణ్డాప్పో ఉప్పడుమ్బడి పణ్ణక్కడవతాయ్ కణ్డాపోతే యెల్లావిడాయుం కెట్టు (కణ్డకణ్ణల్) మయిరెటియుమ్బడి యిరున్దు కుళిర్న్దు

వజ్రమును కరిగించునదియై పురుషులనుకూడ నాడకట్టును కట్టించునదియు బంధువులతో సంబంధమును ఛేదించి లోకమందు పగను కలుగజేసి (మిక్కిలి యున్నతమైన పరమపదమం దుండెడి నిత్యసూరినాయకునిగూర్చి కుత్సితస్త్రీలమై నుట్టలెక్కెదము) అనుచున్నప్రకారముగా చూచినప్పుడే హస్తమున్నూ మట్టయున్నూగా బయలుదేరేప్రకారముగా చేయునదై, చూచినంతనే సమస్త తృష్ణయును నశింపచేయునదై (చూచిన నేత్రములు) రోమాంచముగలవగునట్లుగా నల్లనై చల్లనై

49 సామ్యాపన్నరాన సూరికళుడైయ నెఞ్జైయుమ్, కణ్ణైయుమ్ పడైయుఱుత్తు (ఇన్నారెన్ఱఱియేన్, ఎఞ్జివరై కణ్డాఅవతెవ్వారిలెన్ఱు) మతిమయఙ్గుమ్బడి పణ్ణక్కడవతాయ్.

సామ్యాపన్నులైన నిత్యసూరులయొక్క మనస్సునున్నూ, నేత్రములనున్నూ స్వాధీనపరచుకొని (వీరుఫలానివారని యెఱుగను పూర్వము వీరినిచూచి యెఱింగిన దేవ్వారునందని) మోహింపచేయునదై,

50. సకలజనజీవాతువాయ్, వైదగ్ధ్యవిద్యాగృహమాయ్, మనోరథానామభూమియాయ్ శృత్యంత వాక్య సర్వస్వమాయ్

మాణిక్కచ్చెప్పిలే పొన్నై యిట్టువైత్తాప్పోలే యిరుక్కప్పొన్నురువాన దివ్యాత్మస్వరూపత్తుక్కు ప్రకాశమాయ్.

సమస్తజనులకును జీవనౌషధమై, చాతుర్యవిద్యకు గృహమై, మనోరథముల కభూమియై, వేదాంతవాక్యములకు సర్వస్వమై, మాణిక్యపు భరిణయందు బంగారమును పెట్టియుంచినట్లుగా బంగారువర్ణమైన దివ్యాత్మస్వరూపమునకు ప్రకాశకమై.

51. ఒన్నుక్కొన్నుతళ్ళి, ఇట్టకత్తిల్ వెళ్ళమ్పోలే శుళ్ళివెళ్ళత్తునిన్ను ముక్తావుకిఱ యాయుధాభరణఙ్గళుడైయ (శోతివెళ్ళత్తినుళ్ళే) యున్నేయమాన (కరియకోల త్తిరువురువైయుమ్)

ఒకదానినొకటి త్రోసివేసుకొని సంకుచితస్థలమందు ప్రవాహమువలె సుడి తిరిగి సంచరించుచున్న ఆయుధాభరణములయొక్క తేజఃప్రవాహమం దూహించవలసినదైన (నల్లని సుందరమైన దివ్యమంగళవిగ్రహమునున్నూ)

52. నిత్యసూరికళ్ అడుత్తడుత్తుప్పార్క్కుఱ పార్వైయుం కూడప్పొఱాదెన్నుంబడియాన సౌకుమార్యత్తైయుమ్.

నిత్యసూరులు మాటిమాటికి చూచుచున్న చూపునుకూడా సహించజాలని సౌకుమార్యమునున్నూ)

53. పెరియపిరాట్టియారుడైయ (వడికొళ్ల వాళ్నెడుంకణ్ కళుక్కు నిత్యలక్ష్యమాయ్యాలే (అరుమ్బెన్నుమ్మలరెన్నుమ్) శొల్లలామ్పడియాన శెవ్వియైయుమ్.

పెరియపిరాట్టిమార్ల యొక్క (వడకట్టిన సౌందర్యము కాంతియును గల విశాలమైన నేత్రములకు) నిత్యలక్ష్య మగుటచేత (మొగ్గయనిన్నీ, పుష్పమనిన్నీ) చెప్పదగిన శోభనున్నూ.

54. కిణ్ణ కత్తుక్కప్పడ విట్టాప్పోలే యిరుక్కిఱ (మెయ్యమర్ పల్ కలన్గళైయుమ్)

ప్రవాహమునకు (తడక) అడ్డు పెట్టినట్లువలెనున్న (తిరుమేని యం దమరియున్న అనే కాభరణములనున్నూ)

55. నిత్యసూరికళై కొళ్ళైయూట్టి కొణ్డు విడాయర్ ముకత్తిలే నీర్ వెళ్ళత్తై త్తిరన్దు విట్టాప్పోలే సకలశ్రమంగళుమాఱుమ్పడి కుళిర్న్దు తెళిన్దు కనకగిరియై యురిక్కిక్కడలిలే విళాశినాప్పోలే (శెమ్బొనేతికళ్ముకిఱ) శ్యామమాన తిరుమేనియొళియాలే (విశ్వమాప్యాయయన్) ఎన్గిఱపడియే సకలజగత్తైయుమాప్యాయనమ్పణ్ణి.

నిత్యసూరులను జూరగా ననుభవింపజేసుకొనుచు వడకొట్టిన వారి ముఖమందు నీటిప్రవాహమును తెరచి విడిచినట్లు సకలశ్రమలును శాంతించునట్లు చల్లనై స్వచ్ఛమై బంగారు పర్వతమును కరిగించి సముద్రమందు కలపివేసినట్లు (ఎఱ్ఱని బంగారమువలెనే ప్రకాశించుచున్న) నల్లనైన తిరుమేని కాంతిచేత (ప్రపంచమును తృప్తిపరచుచూ) అనుచున్న ప్రకారముగా సమస్త జగత్తులనున్నూ తృప్తిపరచుచు

56. (తెరువెల్లాక్కావికమళ్) ఎన్గిఱపడియే కణ్డవిడమెఙ్గుంపుఱప్పట్టు ప్రవహిక్కిఱ తిరుమేనియిల్ పరిమళత్తాలే శ్రీవైకుంఠత్తై యెఙ్గుమొక్కపరిమళితమాక్కి.

(వీధులయం దెల్లెడల నల్లకలువలు పరిమళించుచున్నవో?) అనుచున్న ప్రకారముగా చూచిన స్థల మంతటను బయలుదేరి ప్రవహించుచున్న తిరుమేనియందలి పరిమళముచేత శ్రీవైకుంఠము నంతను సమానముగా పరిమళించునట్లుగా జేసి.

57. ఆలాం కట్టయెవిట్టటిన్దాప్పోలే యుడమ్బెజ్గుం పవ్వాలిడుమ్బడి కుళిర్న్దు అరైక్షణమాటిల్ నిత్యముక్తరై యొరునీర్చావి యాక్కుకిఱ కటాక్షామృతవృష్టికళాలే దివ్యగోష్ఠియై తళిరుం ముఱియు మాక్కి.

మంచుగడ్డను విశిరినట్లువలె శరీరమంతటను వణుకును బుట్టించునట్లు చల్లనై యరక్షణము వట్టిపోయిన నిత్యముక్తుల నొకతడి చాలక చచ్చిపోయెడి చేనువలె చేయుచున్న కటాక్షామృతవర్షములచేతను దివ్యగోష్ఠిని చిగుళ్లూ ఆకులును కలదానినిగా చేసి.

58. గాంభీర్య మాధుర్యాద్యనవధిక గుణభూషితంగళాయ్ అతిమనోహరదివ్యభావగర్భంగళాయ్ పూవలర్న్దాప్పోలేయిరుక్కిఱ తిరుముకత్తైయెజ్గుమొక్కచ్చెవ్విపెఱుత్తు.

గాంభీర్యము మాధుర్యము మొదలగు నిరవధికమైన గుణగణములచేత నలంకరించబడినవై యతిమనోహరమైన దివ్యభావములు గర్భమందు గలవై పుష్పము వికసించినట్లున్న తిరుముఖము నంతటను సమానముగా శోభను పొందించి

59. వినవానలీలాలాపజ్గళాలే సూరికళుడై య హృదయజ్గళై యుకప్పియానిన్జు కొణ్డు ఉభయవిభూతియైయుం ఆసనబలత్తాలే జయిత్తు.

తృతీయ ప్రకరణమ్ సంపూర్ణమ్

—o—

అడుగుచున్న లీలాలాపముచేత నిత్యసూరులయొక్క హృదయములను సంతోషింపజేసుకొనుచు ఉభయ విభూతులనుకూడ నాసనబలముచేత జయించి.

తృతీయ ప్రకరణము తాత్పర్యము సంపూర్ణము.

—o—

తా॥ కోకిలా! ఎముకలు కరిగిపోయి యొకదాని కొకటి సాటియైన బల్లెమువంటి దీర్ఘములైన నేత్రములు చాలాదినములు రెప్పలు పొందవు. దుఃఖమనెడి సముద్రమందు ప్రవేశించి వైకుంఠ మనెడి యొక దోనెను లభించక శ్రమపడుచున్నాను. ప్రేమగలవారిని విశ్లేషించి పొందెడి బాధను నీవును యెఱుగుదువు, బంగారమువంటి తిరుమేని గలవాడును గరుడధ్వజము గలవాడును నైన పుణ్యాత్ముడైన కృష్ణుని వచ్చునట్లుగా పిలువుము.

తి. వా. మొ. 2 ప. 4 తి. 7 పా.

పా॥ ఉళ్ళోళావియులర్ న్దులర్ న్దైన
వళ్ళలే కణ్ణనేయెన్నుమ్ పిన్నుమ్
వెళ్ళనీర్ కిడన్దాయెన్నుమ్. ఎన
కళ్విదానప్పట్టు వఞ్జనైయే.

తా॥ నా దొంగశాలికయైన యీామె తాను పడిన వంచన లోలోపల నుండుయాత్మను మిక్కిలి యెండిపోయి నాయొక్క ఉదారుడా! కృష్ణుడా! అనును. తరువాతకూడా సముద్రజలమందు పవ్వళించిన వాడా! అనును.

తిరుప్పావై - 27 పా॥

పా॥ కూడారై వెల్లుఞ్జీర్ గోవిన్దా వున్దన్నై
ప్పాడిప్పఱై కొణ్డు యామ్బెఱుశమ్మానమ్
నాడుపుకళుమ్ పరిశినాల్ నన్డాక
శూడకమే తోళ్వళైయే తోడే శెవిప్పూవే
పాడకమే యెన్ఱనైయ పల్ కలనుమ్ యామణివోమ్.
ఆడైయుడుప్పోమతన్ పిన్నే పాల్ శోఱు

మూడనెయ్ పెయ్ తు ముళ్ఙ్గైవళ్రివార
క్కూడియిరున్దు కుళిర్న్దేలో రెమ్బావాయ్

తా॥ కూడనివారిని జయించెడి గుణములుగల గోవిందుడా! నిన్ను పాడి ప్రాప్యమును పుచ్చుకొని మేము పొందెడి సన్మానము, లోకులు స్తోత్రము జేయుప్రకారముగా చక్కగా చూడిగములు దండకడియములు, కమ్మలు, కర్ణపుష్పములు పావడములు అని యిటువంటి యనేకాభరణములను మే మలంకరించుకుందుము వస్త్రమును కట్టుకొనెదము, దానితరువాత క్షీరాన్నమును మునుగునట్లుగా నేయిపోసి మోచేతిమార్గముగా కారునట్లు కూడి కూర్చొని చల్లపడెదము (భుజించెదము) ఏలుకొనుము, ఆలోచించుము, మావ్రతము,

రా శా కా 18 స 50 శ్లో

శ్లో॥ ప్రణష్టస్య యథా లాభో యథాహర్షో మహోదయే
తథైవాగమనం మన్యే స్వాగతం తే మహామునే

తా॥ ఓ విశ్వామిత్ర మహర్షీ! పోయిన వస్తువుయొక్క లాభము ఎట్లగానో మహోదయము కలిగినప్పుడు సంతోష మేవిధముగానో ఆవిధముగా నీయాగమనమును తలంచుచున్నాను నీకు స్వాగతము

తి చ వి 71 పా

పా॥ నడన్దకాల్ కళ్ నొన్దవో నడుఙ్గఞాల మేనమాయ్
ఇడన్దమెయ్ కులుఙ్గవో విలఙ్గుమాల్ వరై చ్చురమ్
కడన్దకాల్ పరన్దకా విరిక్కరై క్కుడన్దైయుళ్
కిడన్దవా ఱెళున్దిరున్దు పేశువాళి కేశనే

తా॥ ప్రతిబంధకమైయున్న పెద్దపర్వతములను, అడవులను దాటిన విస్తారమైన కాలువలుగల తిరుక్కావేరియొక్క తీరమందున్న తిరుక్కుడన్దైయందు పండుకొనిన ప్రకారము లోకములను కొలచిన తిరువడికళ్ళు నొచ్చుటచేతనా? భూమి వణకగా వరాహమై పట్టు విడిపించిన శరీరము శ్రమపడియా? కేశవుడా! కూర్చొని చెప్పుము. మంగళముగుగాక!

శ్లో॥ మనోహరై శ్చాటుభి రార్ద్రయన్మదా (ఆకరము తెలియదు)

తా॥ సంతోషముచే మనోహరమైన చాటూక్తులచేత చల్లపరచుచూ.

పె. తి. మొ. 9 ప. 7 తి. 7 పా.

పా॥ నోయెలామ్పెయ్ తతోరాక్కైయై మెయ్యెనక్కొణ్డు వాళా
పేయర్ తామ్పేశు మప్పేచ్చై నీపిళైయెనక్కరుతినాయేల్
తీయులా వెజ్గతిర్ తిజ్గళాయ్ మజ్గుల్ వానాకినిన్ఱ
మాయనార్ వల్లవాళ్ శొల్లుమావల్లైయాయ్ మరువునెఞ్జే.

తా॥ మనస్సా! వ్యాధుల నన్నింటిని పెట్టి చేసినదైన యొక శరీరమును సత్యమనుకొని వ్యర్థముగా పిచ్చివారు తాము చెప్పెడి యామాటను నీవు తప్పని తలంచినదానివైతే యగ్నివర్తించుచున్న ఉష్ణకిరణుడైన సూర్యుడును చంద్రుడునునై మేఘములును ఆకాశమునునైయున్న యాశ్చర్యభూతుడైన స్వామి వేంచేసియున్న తిరువల్లవాళ్ అనెడి దివ్యదేశమును చెప్పేప్రకారముగా సమర్థమైనదానవై యమరియుండుమూ.

పెరి. తి. మొ. 5 ప. 3 తి. 6 పా.

పా॥ ఎరుత్తుక్కొడియుడైయానుమ్ పిరమనుమిన్దిరనుమ్ మఱ్ఱుమ్
మొరుత్తరుమిప్పిఱవి యెన్నుమ్ నోయ్ క్కు మరున్దఱివారుమిల్లై

మరుత్తువనాయ్ నీన్ఱమామణివణ్ణా! మఱుపిఱవితవిర
త్తిరుత్తియున్ కోయిఱ్కడైప్పాకప్పాయ్ తిరుమాలిరుఞ్జోలై
యెన్దాయ్.

తా॥ తిరుమాలిరుఞ్జోలైయందు వేంచేసియున్న మా స్వామీ! వృషభవాహనుడైన రుద్రుడును బ్రహ్మయును ఇంద్రుడును మిగిలిన దేవతలును ఒకరును యీ జన్మయనెడి వ్యాధికి మందు యెఱిగిన వారును లేరు. వైద్యుడవై యున్న నీలరత్నమువంటి వర్ణముగలవాడా! మారుజన్మ విడచునట్లుగా దిద్ది నీ కోయిల గుమ్మమందు ప్రవేశించు నట్లుగా చేయుము.

తి. వా. మొ. 2 ప. 6 తి. 4 పా.

పా॥ వళ్ళలే మదుశూదనా వెన్మరతక మలైయే యునై నినై
న్దెల్ కల్ తన్దవెన్దాయునై న్ఱ యెజ్గనమ్ విడుకేన్
వెళ్ళమే పురై నిన్బుకళ్ కుడైన్దాడి ప్పాడికళిత్తుకన్దుకన్దు
ఉళ్ళనోయ్కళెల్లామ్ తురన్దుయ్న్దు పోన్దిరున్దే.

తా॥ ఉదారుడా! మధువనెడి యసురుని సంహారించినవాడా! నా మరకతపర్వతము వంటివాడా! నిను తలంచి యితర విషయముల యందు వైరాగ్యము కలుగుటను యిచ్చిన మా స్వామీ! సముద్ర సమానమైన నీ కల్యాణగుణములయం దవగాహించి యాడి పాడి యానందించి పైపైగా నానందమును పొందియున్న వ్యాధుల నన్నిం టిని పోగొట్టుకొని యుజ్జీవించి వచ్చియుండి నిన్నెట్లుగా విడచెదను.

తి. వా. మొ. 8 ప. 9 తి. 6 పా.

పా॥ తిరువరుళ్ మూళ్గికి వైకలుఞ్జ్రూనీర్ నిఱక్కణ్ణపిరాన్
తిరువరుళ్ కళుఞ్జేర్న్దమై క్కడైయాళన్దిరున్దవుళ

తిరువరుళ రుళాలవన్ శెన్డుశేర్ తణ్డిరుప్పులియూర్
త్తిరువరుళ్ క లెముళొణ్బ్రుత్తుతు మెల్లియల్ శెవ్విత ప్రే.

తా॥ జలసమృద్ధిగల సముద్రమువంటి కాంతిగల కృష్ణుడైన యుప కారకునియొక్క దివ్యకృపయందు ప్రతిదినమును మునిగి దివ్యకృప లను చేరిన దాని కానవాళ్లు స్పష్టముగా నున్నవి. దివ్యకృపను కృప జేయుట కాసర్వేశ్వరుడు వెళ్ళి చేరియున్న చల్లని తిరుప్పులియూరి యందు వేంచేసియున్న వానియొక్క దివ్యకృపచేతను వృద్ధిపొందిన పోకచెట్లయొక్క సుందరమైన ఫలమువలె నున్నది. మృదువైన స్వభావముగల యీామెయొక్క యెఱ్ఱని యధరము.

రా. యు. కా. 19 స. 7 శ్లో.

శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా రామోవచన మబ్రవీత్
వచసా సాంత్వయిత్వైనం లోచనాభ్యాం పిబన్నివ
ఆఖ్యాహి మమ తత్త్వేన రాక్షసానాం బలాబలం.

తా॥ ఆ విభీషణునియొక్క ఆ మాటను విని రాముడు ఈ విభీష ణుని వాక్కుచేత నూరడించి నేత్రములచే పానముచేయుచున్న వానువలె నాదరముగా చూచి "నాకు రాక్షసులయొక్క బలాబల మును యధార్థముగా చెప్పుము" అని మాటను పలికెను.

తిరుమాలై. 36 పా.

పా॥ మఱ్ఱైక్కట్టువరై మునేన్దుమ్ మైన్దనే మతురవాత్తే
ఉఱ్ఱైక్కట్టేపోల నోక్కుముడై యువరై వలైయుట్ పట్టు
ఉఱ్ఱేక్కిట్టేఱ్కునై నోక్కాతొ ట్రివతే యునై్నయెన్నే
అఱ్ఱేక్కిట్టేనాతిమూర్తి యరంగమానకరుళానే.

తా॥ రాళ్ళవర్షమునకు నాడు పర్వతమును ముందుగా ధరించిన బలాఢ్యుడా! మధురమైన నదివంటి వాడా! లేడిపిల్లవంటి చూపులు గల స్త్రీలయొక్క వలలోపడి తల్లడించుచున్న నన్ను కటాక్షించ కుండా విడచినావే. జగత్కారణభూతుడా! శ్రీరంగమనెడి మహా నగరమందు వేంచేసియున్నవాడా! నిన్ను పిలచుచున్నాను. రక్షించ కుండా నాలస్యము చేయుటకు కారణ మేమి?

తి. వా. మొ. 9 ప. 2 తి. 1 పా.

పా॥ పణ్డైనాళాలే నిన్తిరువరుళుమ్ పజ్గయత్తాళ్ తిరువరుళు
జ్గొణ్డునిన్గోయిల్ శీయ్ త్తుప్పల్ పడికాల్ కుడికుడి వన్దివన్దా
ట్చెయ్యుమ్
తొణ్డరోక్కరుళిచ్చోతివాయ్ తిఅన్దు న్తామరైక్కణ్గళాల్
నోక్కాయ్
తెణ్డిరైప్పొరునల్ ఱణ్పణైశూన్ద తిరుప్పుళిజ్గుడి క్కిడన్దానే.

తా॥ స్వచ్ఛమైన తరంగములు గల తామ్రపర్ణీ తీరమందున్న చల్లని చెరువులచే చుట్టువారుకొనబడిన తిరుప్పుళిజ్గుడియందు పవ్వళించిన వాడా! నీయొక్క దివ్యకృపను కమలవాసినియైన లక్ష్మీదేవియొక్క దివ్యకృపను చిరకాలమునుండి గలవాడనై నీకోయిలను తుడిచి యనేక పురుషాంతరములనుండి కులక్రమాగతమైన మార్గమందు వచ్చి కైంకర్యమును చేయుచున్నదాసులమైన మాకు కృపజేసి తేజస్సు గల నోరును తెరచి నీ తామరపుష్పములవంటి నేత్రములచే కటా క్షించుము.

తి. వి. 42 పా.

పా॥ వన్ కాల్ ఱత్తైయ వొరుగ్జే మఱిన్దు కిడన్దలర్న్ద
మెన్ కాఱ్కమలత్తడమ్బోల్ పొలిన్దన మణ్ణుమ్ విణ్ణు

మెన్ కాఱ్కళివిన్ఱ్ఱకాశ్మినెన్బానొత్తువానిమిర్న్ద
తన్బాఱ్పణిన్ద వెన్బాల్ ఎమ్బిరానతడఙ్గణ్ణే

తా॥ పెద్దగాలి కొట్టగా నొక ప్రక్కనుచేరి పడియుండి వికసించిన మృదువైన కాడలుగల తామరలయొక్క తటాకమువలె ప్రకాశించుచున్న నా యుపకారకునియొక్క విశాలమైన నేత్రములు భూమియు నాకాశమును నా కాలికి కొంత చాలదు మూడం? యని యనెడి వానివలె నాకాశమువరకు చాచిన తన పట్లను నమస్కరించిన నాయందు సమృద్ధమై యుంటున్నవి

తి వి 45 పా

పా॥ పెరుఙ్గేழுలార్ తెమ్ పెరుఙ్గణ్ మలర్ ప్పుణ్డరీకమ్ నమ్మేల్
ఒరుఙ్గే పిఱழ வైత్తారివ్వాకాలమ్ ఒరువర్ నమ్మోల్
వరుఙ్గెழ் పవరుళరే తొల్లైవాழ் ఖుమ్ శూழ் పిఱప్పుమ్
మరుఙ్గేవరప్పెఱుమే శొల్లువాழ் నుడనెఞ్జమే।

తా। పెద్ద తిరుమేనిగల వరాహపెరుమాళ్ తమయొక్క వికసించిన పద్మములవంటి పెద్ద నేత్రములను మనపైని యనేకరితిగా ప్రకాశించునట్లుగా నుంచిరి ఈకాలమందు ఒకరును మనను పోలినవారును భాగ్యము కలవారును కలరా? అనాదియైన భాగ్యము కలవారమైతిమి చుట్టుకొనియున్న జన్మమున్నూ సమీపమునకు వచ్చుటకు లభించునా? భవ్యమైన మనస్సా! చెప్పుము మంగళ మగుగాక!

తి వా మొ 2 ప, 6 తి 2 పా.

పా॥ శిక్కెనచ్చిఱితోరిడము ఖ్ఖుఱప్పడాత్తన్నుళ్ళే, యులకుక
ళొక్కవేవిழுఙ్గిప్పుకున్దాన్ పుకున్దతఱ్పిన్

మిక్కఞాన వెళ్ళచ్చుడర్ విళక్కాయ్త్తుళక్కఱ్ఱ

ముతమాయ్ ఎజ్లుమ్

పక్కనోక్కఱియా నైన్బద్దామరైక్కణ్ణనే.

తా॥ అల్పమైన దేశమును తిప్పక లోకములను తన సంకల్పమందు ఒకకాలమందే ఉంచుకొని దృఢముగా ప్రవేశించినాడు. ప్రవేశించిన తరువాత యధికమైన జ్ఞానప్రవాహ మనెడి తేజస్సుగల దీపమువంటివాడై చలనములేని యమృతమువంటివాడై నాయొక్క సుందరమైన తామరపుష్పములవంటి నేత్రములు గలవాడైన శ్రియఃపతి యెచ్చటను ప్రక్కచూపు నెఱుగడు.

తి. వా. మొ. 6 వ, 9. తి. 5 పా.

పా॥ విణ్మీతిరుప్పాయ్ మలైమేల్ నిఱ్పాయ్ కడల్చేర్పాయ్

మణ్మీతుఱ్ఱాల్వా యివఱ్ఱుళెజ్లుం మఱైన్దురైవాయ్

ఎణ్మీతియన్రపుఅవణ్డత్తాయెనతావి

యుణ్మీతాడి యురుక్కాట్టాతే యొళిప్పాయో.

తా॥ పరమపదమందున్నవాడా! తిరుమలయందు నిలచియున్నవాడా! క్షీరసముద్రమందు పవ్వళించినవాడా! భూమియందు సంచరించెడివాడా! యీ పదార్థములయం దంతటను దాగి నివసించుచున్నవాడా! సంఖ్యకు పైనున్న బయటనున్న యండములలో నున్నవాడా! నా యాత్మకు లోపలను పైని సంచరించి నీరూపమును కనపరచకుండా దాచెదవా?

ముం. ఉ. 3 ముం. 2 ఖం. 3 మం.

మం. నా యమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా

శ్రుతేన.

యమే వైషవృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే
తనూం స్వామ్

తా॥ ఈ పరమాత్మ మననముచేతను పొందదగినవాడు కాడు. నిధి ధ్యాసనముచేతను పొందదగినవాడు కాడు. బహుశ్రవణము చేతను పొందదగినవాడు కాడు. యీ పరమాత్మ యెవనిని వరించుచున్నాడో వానిచేత పొందదగినవాడు. వానికి యీ పరమాత్మ తన స్వరూపమును వివరించుచున్నాడు.

పె. తి. మొ. 4 ప. 9 తి. 4 పా.

పా॥ అశైవప్పువాతేత్తు మెనక్కిఙ్గిప్పుక్కాయ్త్తడియోఙ్క
త్తేశమఱియవుమక్కేయాళాయ్ త్తిరికిన్దోముక్కు
కాశినొళియిల్ తికళ్ప్పుమ్ వణ్ణమ్ వణ్ణమ్ కాట్టిరెమ్బురుమాన్
వాశివల్లిరిన్దఙూరిర్ వాఙ్న్దే పోమ్ నీరే.

తా॥ యీ విషయమందు సేవించవలయు ననెడి యాశ విచ్ఛేదము లేకుండా స్తోత్రముజేయు దాసులమైన మాకవద్యమైనది. దేశమంతటను తెలుసుకొనేటట్లుగా మీకే దాసులమై తిరుగుచున్న మాకు బంగారుకాశుయొక్క కాంతికంటెను ప్రకాశించుచున్న వర్ణమును (తిరుమేనిని) కనపరచరైతిరి. మా స్వామీ! తిరువిన్దఙూరునందు వేంచేసియున్న స్వామీ! తారతమ్యము జేయ సమర్థులైన మీరే సుఖించి పొండి.

తి. వా. మొ. 1 ప. 10 తి. 8 పా.

పా॥ శెల్వనారణనెన్ఱ శొల్కేట్టలుమ్
మల్కుమ్ కణ్పని నాడువన్ మాయమే

అల్లునన్బకలు మిఙ్లై పీడిన్ది
నల్కియెన్నైవిడాన్ నమ్బి నమ్బియే,

తా॥ శ్రీమన్నారాయణు డనిన మాటను వినగానే నేత్రములయం దానంద బాష్పములు సమృద్ధ మగును వెదకెదను ఆశ్చర్యము పూర్ణుడైన శ్రియ పతి మంచిరాత్రియందు పగటియందు విచ్ఛేదము లేకుండా నన్ను నమ్మి యుపకరించి విడువడు

రా యు కా 1 స 13 శ్లో

శ్లో॥ ఏష సర్వస్వ భూతస్తు పరిష్వఙ్గో హనూమత
మయాకాల మిమం ప్రాప్య దత్తస్తస్య మహాత్మనః

తా॥ మహాత్ముడైన యా ఆంజనేయునకు నాచేత నీకాలమును పొంది సర్వస్వమైన యీ ఆలింగనమై తే యివ్వబడినది

రా సుం కా 34 స 23 శ్లో

శ్లో॥ కిన్నుస్యాచ్చిత్తమోహోయం భ వే ద్వాతగతిస్త్వియమ్
ఉన్మాదజో వికారోవా స్యాదియం మృగతృష్ణికా

తా॥ ఇది చిత్తమోహ మగునా? ఇది వాయువుయొక్క గతి యగునా? ఉన్మాదమువలన పుట్టిన వికార మగునా? ఇది యెండ మావు యగునా?

తి వా మొ 8 ప 7 తి 3 పా

పా॥ అరుళ్ తానినియనటియే నవనెన్నుళ్
ఇరుళ్ త నటవిళ్ త్తిరున్దా నితువల్లాల్
పొరుళ్ తానెనిల్ మూవులకుమ్ పొరుళ్ల
మరుళ్ తానీతో మాయమయక్కు మయక్కే

తా॥ ఆసర్వేశ్వరుడు నాహృదయమందున్న యజ్ఞానము పోవునట్లుగా వేంచేసియుంటున్నాడు. ఇది తప్ప పురుషార్థమంటె మూడు లోకములను పురుషార్థము కాదు. ఇక కృపనుకూడ నేనెఱుగను. ఇది భ్రమయా? ఆశ్చర్యకరమైన భ్రామకవ్యాపారములచే భ్రమింపజేసెనా?

పె. తి. మొ, 11 ప. 6 తి. 10 పా.

పా॥ తేవరై యు మశురరై యు న్దిశై కళై యు జ్గడల్ కళై యుమ్
మత్ ఱుమ్ ముత్ ఱుం
యావరై యు మొ ఱ్ఱియామే యెత్చి కుమానుళ్ళా మిత్తనత
జీన్దుశ్ళోన్న
కావళరు మ్బెత్తిల్ మజైక్కలికన్తి యొలిమాలై కత్ ఱు
వల్లార్
పూవళరు న్దిరుమకళాలరుళ్ పెత్ ఱు పొన్నులకిల్
పొలివర్ తామే.

తా॥ దేవతలను యసురులను దిక్కులను సముద్రములను యింకను సమస్తమును యెవరినీ విడువకుండా మా స్వామి భుజించి యుమ్మివేసి నది తెలుసుకొని సాయించిన యడవివలె పెరిగిన తోటలు గల తిరుమజైకు నిర్వాహకులైన తిరుమజైయాళ్వార్ యొక్క శ్రీసూక్తి మాలికలైన యీ పది పాశురములను యభ్యసించి సమర్థులైనవారు పుష్పమందు వృద్ధిపొందిన లక్ష్మీదేవిచేత కృపను లభించి పరమపదమందు సమృద్ధి కలవా రగుదురు.

పెరు. తి. మొ. 6 తి. 7 పా.

పా॥ పై యరవినణై ప్పళ్ళియినాయ్ పణ్ణై యోమల్లోమ్ నామ్
నీయుకక్కుమ్

మైయరియోణ్ కణ్ణినారుమల్లోమ్ వైకియెన్ శేరి వరవాప్లినీ.
శెయ్యవుడైయుమ్ తిరుముకముమ్ శెజ్గనివాయుమ్ కుప్లలుమ్ కణ్డు.
పాయ్యురునాళ్ పట్టతే యమైయుమ్ పుళ్ళువమ్బ్బశాతేపోకు నమ్బ్బా.

తా॥ ఫణములు గల తిరువనన్దాళ్వా ననెడి భోగ్యమైన పడకను పడకగా గలవాడా! పూర్ణుడా! మేము పాతవాళ్ళము కాము. నీవు సంతోషించెడి కాటుకచేత నలంకరించబడిన లేడివంటి కాన్తిగల నేత్రములు గలవారమున్నా కాము. నీవు ఆలస్యముచేసి మాయింటికి రాకుము. ఎఱ్ఱని వస్త్రమును తిరుముఖమండలమును ఎఱ్ఱని దొండపండువంటి యధరమును కేశపాశమును చూచి యసత్యమును ఒకనాడు పడినదే చాలును. కృత్రిమమైన మాటలను చెప్పకపోమ్ము.

శ్లో॥ పూర్వాంగా దధికా పరాంగ కలహమ్. (ఆకరము తెలియదు)

తా॥ వెనుకనున్న యవయవములకు సౌందర్యము నిమిత్తం కలిగిన కలహము. ముందున్న యవయవములకు సౌందర్యము నిమిత్తం కలిగిన కలహముకంటె నధికము.

పె. తి. మొ. 2 ప. 8 తి. 7 పా.

పా॥ ముప్లిశె వణ్ణాడియతణ్డుళ్ళాయిన్ మొయ్న్మలర్ కణ్ణియుమ్ మేనియుంశా
న్దిప్లిశియ కోలమిరున్దవాశెజ్గనమ్ శొల్లుకే నోవినల్లార్
విప్లుతియు తామరైయన్న కణ్ణుమేన్దిప్లిలాకముమ్ తోళుమ్ వాయుమ్
అప్లకియతా మివరార్ కొలెన్నవట్టపుయకరత్తేనన్దారే.

తా॥ తుమ్మెదలు ముసురుకొని యూదుచున్న చల్లని తిరుత్తుళాయి యొక్క దట్టమైన పుష్పమాలికయును, తిరుమేనియందు సుందరమైన చందనమును పూసుకొనిన యలంకారమును ఉన్న ప్రకారము నెట్లుగా చెప్పెదను. చిత్రలేఖనమందు నేర్పుగలవారు వ్రాసిన తామరపూవులనదగిన నేత్రములును, అధికమైన సౌందర్యము గల వక్షస్థలమును, భుజములును, అధరమును సుందరముగా నుంటున్నది. వీ రెవరో ? అనగా నష్టభుజకరమందున్న స్వామి నన్నారు.

పె. తి. మొ. 9 ప. 2 తి. 1 పా.

పా॥ పొన్నివర్ మేని మరతకత్తిన్ పొజ్జికళ్ళోతియుకలత్తారమ్
మిన్నివర్ వాయినల్ వేతమోతుమ్ వేతియర్ వానవరా
వర్ తోழி
ఎన్నైయుమ్ నోక్కి యెన్నల్ కులమ్ నోక్కి యేన్దిళజ్గొజ్గైయుమ్
నోక్కుకిన్టార్
అన్నై యెన్నోక్కు మెన్టఞ్జు కిన్టేనచ్చో వొంటువర ప్రకియా.

తా॥ వీరియొక్క తిరుమేని బంగారము, మరకతముయొక్క వృద్ధి పొందుచున్న లేతనైన తేజస్సుగల వక్షస్థలమందు హారము మెరుపువలె నుంటున్నది. సఖి! వీరు నోటియందు సామవేదమును చెప్పుచున్న వైదికులా దేవతలై యుందురా! నన్నును చూచి నా నితమ్బప్రదేశమును చూచి వృద్ధిపొందిన లేతనైన స్తనములను చూచుచున్నారు. తల్లి యేమి చూచునోయని భయపడుచున్నాను. ఒకరు సుందరముగా నున్న ప్రకార మాశ్చర్యము.

ఛాం. ఉ. 7 ప్ర. 24 ఖం. 1 మం.

మం॥ యత్రనాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా.
అధ యత్రాన్యత్పశ్యత్యన్యచ్ఛృణో త్యన్యద్విజానాతి తదల్పమ్.

తా॥ ఏవస్తు వనుభవించబడుచుండగా దానికంటె నితరమైనదానిని చూడడో, యితరమైనదానిని వినడో, యితరమైన దానిని తెలుసుకొనడో, అది యధికము. మరి యేవస్తు వనుభవించుచుండగా యితరమైనదానిని చూచుచున్నాడో! యితరమైనదానిని వినుచున్నాడో! యితరమైనదానిని తెలుసుకొనుచున్నాడో! అది యల్పము.

పె. తి. మొ. 4 ప. 3 తి. 6 పా.

పా॥ మన్లై నూమున్నీరతర్ పడమలై యాలన్లై శెయ్తుమకిళ్న్ద
పన్నైన్నే.
కల్లిన్ మీతియన్టకడిమతిళిలజ్గై కలజ్గవోర్ వాళితొట్టానై
శెల్వనాన్మరైయోర్ నాజ్గై నన్నడువుళ్ శెమ్బొన్ శెయ్
కోయిలినుళ్ళే
అల్లిమామలరాళ్ తన్నొడు మడియేన్ కణ్డుకొణ్డల్లల్
తీర్న్దేనే.

తా॥ సమృద్ధమైన గొప్పదైన సముద్రమందు మార్గము పడునట్లుగా పర్వతములచే సేతువును కట్టి సంతోషించినవాడును, సువేలాచలముపై నివర్తించుచున్న రక్షకమైన ప్రాకారములుగల లంక కలుషపడునట్లుగా నొక బాణమును స్పృశించి ప్రయోగించినవాడును నగు స్వామిని సంపదగల చతుర్వేదాధ్యయనపరులు గల తిరునాజ్గూర్ నట్టనడుమనున్న శెమ్బొన్ శెయ్ కోయిలినందు రేకులు గల శ్లాఘ్యమైన పద్మమం దవతరించిన లక్ష్మీదేవితోకూడా దాసుడనైన నేను సేవించి దుఃఖమును పోగొట్టుకొంటిని.

తి. వా. మొ. 5. ప. 8 తి. 9 పా.

పా॥ ఇళై విత్తెన్నైయున్నాళిన్లై క్కీడ్డిరుత్తుమమ్మానే
యళై విలమరర్ తలైవర్తలైవా వాతిప్పెరుమూర్తి

తిశై విల్ వీశుమ్ శెయ్యమామణి కళ్ శేరు న్దిరుక్కుడన్దై
యశైవిలులకమ్ పరవక్కిడన్దాయ్ కాణవారాయే.

తా॥ నన్ను సమ్మతింపజేసి నీపాదద్వంద్వముక్రింద నుంచుకొనిన స్వామీ! చలనములేని నిత్యసూరులకు ప్రధానులైన విష్వక్సేనులు మొదలగువారికి ప్రధానుడా! కారణమైన సర్వాధికుడవైన స్వామీ! దిక్కులయందు తేజస్సు వ్యాపించుచున్న పెద్ద శ్లాఘ్యమైన రత్నములు చేరియున్న తిరుక్కుడన్దైయందు శ్రమలేకుండా లోకము స్తోత్రము చేయునట్లు పవ్వళించినవాడా! నేను సేవించునట్లు వేం చేయుము.

తి. వా. మొ. 4 వ. 7 తి. 7 పా.

పా॥ అటిన్దటిన్దు తేటిత్తేటి యానవకావియుళ్ళే
నిఱైన్దఞానమూర్త్తియాయై నిన్మలమాకవైత్తు
పిఱన్దుమ్ శెత్తుమ్ నిన్ఱిడరుమ్ పేతైమై తీర్న్దొళిన్దేన్
నఱున్దుళాయిన్ కణ్ణియమ్మా నానునై క్కణ్డుకొణ్డే.

తా॥ పరిమళించుచున్న తిరుత్తుళాయియొక్క మాలికగల స్వామీ! నేను నిన్ను సేవించి తెలుసుకొని మిక్కిలి తేటను పొంది నేను నామనస్సునందే పూర్ణమైన జ్ఞానస్వరూపుడవైన నిన్ను నిర్మలముగా నుంచుకొని పుట్టియు చచ్చియునుండి కష్టపడెడి యజ్ఞానమును పోగొట్టుకొంటిని.

తి. వి. 63 పా.

పా॥ వణ్ణమ్ శివన్దుళవానాడమరుమ్ కుళిర్విళియు
త్తణ్మైన్ కమలత్తడమ్పోల్ పొలిన్దన, తామివై యో

కణ్ణన్ తిరుమాల్ తిరుముకన్దన్నొడుమ్ కాతల్ శెయ్ తే
త్కణ్ణమ్బుకన్దు, అడియే నొడిక్కాల మిరుక్కిన్ఱతే

తా॥ వర్ణముచేత నెఱ్ఱగా నుంటున్నవై పరమపదమం దమరియున్న చల్లనికటాక్షము గలవై చల్లనై మృదువైన తామరలు పుష్పించిన తటాకమువలె సమృద్ధమైనవియైన నేత్రములా శ్రియఃపతియైనకృష్ణుని తిరుముఖమండలముతో నాశగల నాయొక్క యభిప్రాయ ప్రకారముగా ప్రవేశించి దాసురాలునైన నాతోకూడా నీకాలమం దున్నవి.

తి వా మొ 8 ప 5 తి 7 పా

పా॥ వన్దుతోన్ఱాయన్ఱే లున్ వైయన్దాయ మలరడిక్కీళ్
మున్దివన్దియానిఱ్పముకప్పేకూవిప్పణికొళ్ళాయ్
శెన్దణ్కమలక్కణ్ కై కాల్ శివన్దవాయోర్కరునాయిఱు
అన్దమిల్లాక్కతిర్ పరప్పియలర్న్దతొక్కు మమ్మానే

తా॥ ఎఱ్ఱనై చల్లనైన తామరపూవులవంటి నేత్రములను హస్తములను పాదములను యెఱ్ఱని యధరమును గల యొక నల్లని సూర్యుడు అంతులేని కిరణములను వ్యాపింపజేసి వికసించినట్లున్న స్వామీ! వచ్చి సేవ సాయించుమా! కాకపోతే నీయొక్క భూమిని కొలచుకున్న పుష్పములవంటి పాదముల క్రిందను ముందఱ నేను వచ్చి నిలచునట్లు నీయెదుటకు పిలచి కైంకర్యమును స్వీకరింపుమా

తి వా మొ 2 ప 9 తి 1 పా,

పా॥ ఎమ్మావీట్టు త్తిఱముమ్ శెప్పమ్ నిన్
శెమ్మాపాతపఱ్పుత్తలై శేర్ త్తొల్లై
కైమ్మా తున్బ మ్మడిన్దపిరానే
యమ్మావడియేన్ వేణ్డువతీతే

తా॥ సర్వప్రకారములచేతను విలక్షణమైన మోక్షముయొక్క ప్రకారమునున్నూ చెప్పుము. నీ యెఱ్ఱని గొప్ప పాదపద్మములను తలయందు శీఘ్రముగా చేర్చుము. తుండము గల గజేంద్రాళ్వానుయొక్క దుఃఖమును పోగొట్టిన యుపకారకుడా! స్వామీ! దాసుడనైన నేను అపేక్షించున దిదియే.

తి. వా. మొ. 9 ప. 2 తి. 10 పా.

పా॥ కొడువినై ప్పడైకళ్ వల్లైయాయచురర్ క్కిడర్ కెడ వశురర్
కట్టిడర్ శెయ్
కడువినై నఞ్జే యెన్నుడై యముతే కలివయల్ తిరుప్పుళి
ఙ్గుడియాయ్
పడివినై యిల్లామలర్ మకళ్ మత్తై నిలమకళ్ పిడిక్కు
మెల్లడియై
కొడువినై యేనుమ్ పిడిక్కనీయొరునాళ్ కూవుతల్ వరుతల్
శెయ్యాయే.

తా॥ క్రూరమైన వ్యాపారములుగల దివ్యాయుధములను ధరించిన సమర్థుడా! దేవతలకు దుఃఖము నశించునట్లుగా నసురులకు దుఃఖమును కలుగజేయుచున్న క్రూరమైన వ్యాపారముగల విషమువంటివాడా! నాయొక్క యమృతమువంటివాడా! సమృద్ధమైన వరిమళ్లుగల తిరుప్పుళిఙ్గుడియందు వేంచేసియున్నవాడా! తిరుమేనికి సాటిలేని కమలవాసినియైన లక్ష్మీదేవియును తక్కిన భూదేవియును పట్టెడి మృదువైన పాదములను క్రూరమైన పాపముగల నేనును పట్టునట్లుగా నీ వొకనాడు పిలుచుకొనుట లేక వచ్చుట చేయుము,

తి. వా. మొ. 4 ప. 3 తి. 6 పా.

పా॥ కాలశక్కరత్తొడు వెణ్శఙ్ఞైయేన్దినాయ్
ఞాలముణ్ణుముమిళ్న్ద నారాయణనే యెన్రెన్రు
ఓలమిట్టునానుయ్రై త్తాలొన్రుమ్ వారాయాకిలుమ్
కోలమామెన్ శెన్నిక్కున్ కమలమన్నకురైకళలే.

తా॥ కాలమునకు నిర్వాహకమైన చక్రముతోకూడా తెల్లని శ
మును ధరించినవాడా! భూమినంతను భుజించి యుమ్మి వేసినవా
నారాయణుడా! అని యని మొరబెట్టి నేను పిలచితే లేశము
వాడవైనను నీపద్మములవంటి యాభరణ ధ్వనిగల తిరువడికళ్ళే
శిరస్సున కలంకార మగును.

తి. వా. మొ. 7 ప. 5 తి. 10 పా.

పా॥ వార్తై యఱిపవర్ మాయవక్కాళన్రియావరో
పోర్త్త పిఱప్పొడు నోయొడు మూప్పొడి ఇప్పివై
పేర్త్తు పెరున్దున్బమ్ వేరఱనీక్కి త్తన్ తాళిన్కీళ్
చ్చేర్త్తవన్ శెయ్యుం శేమత్తై యెణ్ణిత్తెళివుత్తే.

తా॥ చరమశ్లోకవార్త నెఱిగినవారు, ఆత్మను కప్పి వేసియున్న
తోను వ్యాధులతోను ముసలితనముతోను మరణముయైనవ
పోగొట్టి కైవల్య మనెడి మహాదుఃఖమును సమూలముగా నశించు
పోగొట్టి తిన పాదద్వయముక్రింద చేర్చుకొని యా శ్రియఃపతి
క్షేమమును తలంచి తేటనుపొంది యాశ్చర్యభూతుడైన కృ
తప్పమఱి యొకరికి దాసులగుదురా?

తి. వా. మొ. 10 ప. 4 తి. 9 పా.

పా॥ కణ్డేన్ కమలమలర్ పాతజ్గాణ్డలుమే
విణ్డేయొ ట్రిస్దవినై యాయిన వెల్లామ్
తొణ్డే శెయ్ తెన్లు న్దొఱుతు వఴియొఴుక
పణ్డేపరమన్ పణిత్త పణివకై యే.

తా॥ దాస్యమును చేసి యెల్లప్పుడును నమస్కరించి మార్గమందొదిగేటట్లుగా పూర్వమే సర్వేశ్వరుడు సాయించిన శ్రీసూక్తి ప్రకారముగా తామరపద్మములవంటి పాదములను సేవించితిని. సేవించగానే పాపములైన వన్నియును విడచే పోయినవి.

తి. వా. మొ. 3 ప. 3 తి. 1 పా.

పా॥ ఒ ఴివిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని
వఴువిలావడిమై శెయ్యవేణ్డునామ్
తెఴికురలరువి తిరువేజ్గడత్తు
ఎఴిల్ కొళ్ శోతి యెన్దై తన్దై తన్దైక్కే.

తా॥ గంభీరమైన ధ్వనిగల ధారలుగల తిరువేంగడమందు వేంచేసియున్న సౌందర్యముగల తేజోమయ విగ్రహము గలవాడును, నాకు, నా తండ్రికి వారి తండ్రికి తండ్రియైనవాడును నైనవానికి మనము విచ్ఛేదము లేని కాలమంతయుకూడా పొందియుండి విచ్ఛేదములేని కైంకర్యమును చేయవలెను.

పెరి. తి. మొ. 1 ప. 1 తి. 12 పా.

పా॥ పల్లాణ్డెన్రు పవిత్తిరనై పరమేట్టియై చ్చార్జ్గమెన్నుమ్
విల్లాణ్డాననై విల్లిపుత్తూర్ విట్టుశిత్తన్ విరుమ్బియశొల్

పల్లాణ్డెన్రు నవిన్రురై ప్పార్ నమోనారాయణాయ వెన్రు
పల్లాణ్డుమ్ పరమాత్మనై చ్చూళ్ న్దిరున్దేత్తువర్ పల్లాణ్డే.

అర్చిరాది చతుర్ధ ప్రకరణత్తిల్ ప్రమాణత్తిరట్టు సంపూర్ణమ్.

—o—

తా॥ పవిత్రుడును పరమపదము వాసస్థానముగా గలవాడును శార్ జ్గ మనెడి ధనస్సు నేలుకొనినవాడును నగు సర్వేశ్వరుని విషయముగా శ్రీవిల్లిపుత్తూరునం దవతరించిన పెరియాళ్వార్లు "పల్లాణ్డు" అని యాదరించి సాయించిన యీ పాశురము ను మంచికాలమని విచ్ఛేదము లేకుండా ననుసంధించువారు సర్వకాలములయందును పరమాత్ముని చుట్టుకొనియుండి యనేకసంవత్సరములు మంగళమని స్తోత్రము చేయుదురు.

అర్చిరాది చతుర్థ ప్రకరణమందలి ప్రమాణత్తిరట్టు తాత్పర్యము సంపూర్ణము.



# 1

# అర్చిరాది - సారసంగ్రహము

( గోపాలాచార్య )

శ్రియఃపతియైన సర్వేశ్వరునకు ఉభయవిభూతులును యథేష్ట వినియోగార్హములై యుండును. అందు భోగవిభూతియందున్నవారా సర్వేశ్వరునియొక్క యాజ్ఞను ఏకాతపత్రముగా శిరసావహించి యాతని యభిమానమునకు పాత్రులై వర్తింతురు. లీలావిభూతియందున్నవారు శ్రియఃపతి యభిప్రాయము ననువర్తించువారు కాకుండ యాతని సంకల్పము ననుసరించువారై వారివలె "నమః" యనుటకు బదులుగ "న న మేయం" (నే నొకరికి వంగువాడను కాను. నేనే యీశ్వరుడను) అనుచును, వారివలె నితరదేవతల నమస్కరింపని యునికికి వ్యతిరేకముగ నితర దేవతలను పాడి యాడువారును, వారివలె మహాపురుషులై యుండక స్వల్పులై యుండువారును, వారివలె జ్ఞానముకలవారై యుండక జ్ఞానహీనులై యుండువారును, వారివలె తేజోమయమైన దివ్యమంగళ విగ్రహములతో నుండక హేయములగు ప్రాకృతశరీరములతో నుండువారును, వారివలె సర్వేశ్వరుని స్తుతించుటయే శీలముగా గలవారు కాక లోకమునందు నీచులను నుతించుచున్నవారును, వారివలె సర్వేశ్వరునకు సర్వవిధముల దాస్యమునుచేయక కాముకులై సుందరీమణులగు స్త్రీలకు దాస్యము చేయువారును, వారివలె దాస్యమునకు తగునట్లలంకరించుకొని భగవద్గుణామృతపానమును జేయక స్త్రీలయొక్క యధరామృతమును పానము జేయువారును, వారివలె భగవంతుని కైంకర్యమునకై బహు శరీరముల ధరించక పుణ్యపాపానుభవముల కెన్నియో శరీరములను ధరించువారును, వారివలె పరమపదమున భగవంతుని యాయుధముల మోచికొనుచు నాతనితో నొకప్రక్కగ సంచరించక శరీరేన్ద్రియ

ములు చూపిన దారిని సంచరించువారును, "ప్రపన్నుని రక్షించుటయే నా వ్రత" మను సర్వేశ్వరుని వ్రతమునకు వ్యతిరేకముగ నుపాయాంతరముల దమపై పెట్టుకొని యాతని చేతి కందక పరువెత్తువారును, ఇట్లల్పసారములును, అనిత్యములునైన శబ్దాదివిషయముల నాస్వాదించి తన నెడకాసి పోవలసిన సంసారిచేతనుల నీచతను జూచి వీరితో తనకుగల స్వాభావికసంబంధమే హేతువుగ విడువజాలక, వీరిని చక్కబరచుటకై యనేకములగు నవతారముల నెత్తి తిరుగుచున్న సర్వభూతసుహృత్తగు సర్వేశ్వరునియొక్క యత్నవిశేషము ఒకానొకనాడు, ఒకానొక యవకాశమందు, ఒకానొక చేతనునియందు ఫలించును. అంత నా చేతనుడు భగవద్భాగవత విషయమై యద్వేషసంకల్పము గలవాడై మోక్షమున నపేక్షకలవాడై వైరాగ్యముతో ప్రవర్తించుచుండును. అంత కొంతకాలమున కాయభినివేశము పక్వమై సదాచార్య సమాశ్రయణమును గావించును. భగవత్ప్రీతికర వ్యాపారములను జేయును. సంసారముయొక్క క్రౌర్యము ననుసంధించును. అంత నాతడు పాము నోటబడిన కప్పవలెను, కారుచిచ్చు కబళీకరించిన యాడ లేడివలెను, రెండు ప్రక్కలను ప్రజ్వలించుచున్న కొరకంచునకు మధ్యనున్న చీమవలెను, తరంగించుచున్న సముద్రమున మునిగిపోవుచున్న యోడయందున్న వానివలెను "ఓ శ్రియఃపతీ! నా కిపుడు తోడుపడువారెవ్వరు ? ఇంకను అనేక శబ్దాదివిషయముల కనబఱచి సంసారములో బడవైచెదవా ? ఇంకను చెడగొట్టెదవా ? అయ్యో ! పంచేంద్రియములును శత్రువులవలె ప్రతి దిక్కునకును బలాత్కారముగ లాగి పడవైచుచున్నవి. తిండిని బట్టను తెమ్మని బాధించుచున్నవి. విడువకున్నవి" అని యింద్రియముల క్రౌర్యమును దలచి మొరపెట్టును. "అయ్యో ! తలంచుటకు శక్యముగాని దుఃఖములను ఫలింపజేసెడి యివి యేమి లోకస్వభావములు ? ప్రాణము నశించుటను జూచిన సహింపజాలను"

అని సంసారులయొక్క నష్టమునకును నొచ్చుకొని సహింపజాలక పిరాట్టికి రాక్షసస్త్రీలతో సహవాస మసహ్యమగునట్లు పిచ్చివారైన లోకమునందలి మనుష్యులతో సహవాసము నాకు దుశ్శకము. సర్వే శ్వరుని ధ్యానమునుండి విముఖులై తిండిని బట్టను మాత్రమే పురు షార్థముగ భావించి పరుగెత్తుచున్న వీరితోడి సహవాసము నాకు దుస్సహము. ఈ స్వభావము నిక నేను పొందకుండ జేయుము. నేను నిన్ను నెక్కడ పొందెదను? అట్లు పొందెడి దినము ఎప్పటికి? నే నా పరమపదము నెప్పటికి చేరగలను? ఇక నేను ధరింపజాలను. నీవు నన్ను పిలుచుకొను కాల మింకను సమీపించదా తండ్రీ" యని భగవదనుభవము లభింపకుండుటచే గొప్ప తృష్ణను పొందును. నిప్పుతో చేరిన మైనమువలె కరగుచు "నేను సేవించునట్లుగా వేం చేయు" మని పిలచి పిలచి అట్లు లభింపక "స్వామీ! ఒక పగలు వేయి కల్పము లగుచున్నది. కృతకృత్యుడనై మృత్యువును ప్రియ బంధునివలె ప్రతీక్షించుచున్నా" నని శరీరమును విడచు సమయము నభిలషించును. భార్యయొక్క యుచ్ఛిష్టము నాదరించు రాజపుత్రుని వలె తా నింతవఱకు నాదరించి హేయమని విడచిన తన దేహము నాదరించుచున్న సర్వేశ్వరుని జూచి "ఈ దేహము నశించుటకు సమ్మతించు" మని యపేక్షించును. నా యాత్మాత్మీయములను ఇంత వఱకు లీలగా ననుభవించితివి. ఇక నా యనుభవమును విడువుము. ఇక నేను నిన్ను విడచి పోవుట కొప్పుకొనను. లక్ష్మీదేవి తోడు, నీతోడు" అని యొట్టు పెట్టుకొని నిర్బంధించును. ఇట్లు పరభక్తి తల యెత్తగా "నేను నా భక్తుని మరణకాలమున స్మరించి పరమపదము నకు గొనిపోవుదును" అనియు, "నే నవతరించినది సాధు రక్షణము కొఱకై" యనియు చేసిన ప్రతిజ్ఞను కాపాడుము. ఇట్లు విలక్షణ ముగా స్తోత్రమును జేసి సదాచార్యసమాశ్రయణమును గావించి శరీ రావసానకాలము దగ్గరించగా సర్వేశ్వరుడు తన తిరువడిఘల్లయందు

వీని తలవంచిననాడు మొదలుకొని వీడు చేయున దంతయు వడ్డీతో పెరిగిన ఋణమువలె తలంచి ప్రత్యుపకారమును వెదకి తల్లడిల్లు చుండును వీనిని దిద్ది నిత్య కైంకర్యమును స్వీకరించదలంచి కోరలు తీసిన పామువలె సంసార మనువర్తించని విధముగ పరమపదమునకు తీసికొనిపోవుటకు త్వరపడును ఈ చేతనుని తృష్ణ గొప్పదమో యను నటుల ఆ శ్రియఃపతి తృష్ణ పెరుగును దశరథ చక్రవర్తి శ్రీరామ చంద్రుల పట్టాభిషేకమునకు వసిష్ఠ వామదేవాదుల పిలిపించి ప్రయ త్నించినట్లు నిత్యసూరుల పిలిపించి మార్గము నలంకరింపజేయును పరమపదము నలంకరింపజేయును వీని పూర్వోత్తరాఘములను వరు ణుని గుఱించి సంధించిన బాణమును మరుకాంతారమందున్న రాక్ష సులపై విడచినట్లు శత్రుమిత్రులయం దారోపించును వీనితో సంబంధము కలవారై నరకానుభవమును చేయుచున్నవారిని స్వర్గమం దుండువారినిగ సంకల్పించును దయాసముద్రుడైన గరుత్మంతు నధి రోహించి, మా వీధిగుండా నడిపించి దర్శన మిమ్మా యని వీడు ఆశ పడిన ప్రకారముగ గరుత్మంతు నెక్కి వచ్చి మేరుపర్వతముపై విజృంభించిన గొప్ప మేఘమువలె దర్శన మిచ్చును తన తిరుమేనిని సంపూర్ణముగ ననుభవింపజేయును ఆతివాహికులను పిలచి కృప జేసి వీనిని సత్కరించు క్రమముగ సత్కరించుట కాదేశించును అటు పిమ్మట ఉపనిషత్తులలో ఉత్క్రమణదశను వర్ణించినట్లు బాహ్యేం ద్రియములు అంతఃకరణముతోను, అంతఃకరణము ప్రాణముతోను, ప్రాణము ఈ చేతనునితోను చేరును. అంత నీ చేతనుడు సూక్ష్మ శరీరధారియై పరమాత్మపట్ల జేరును పిమ్మట గ్రీష్మకాలమునందు సూక్ష్మకిరణములచే తపింపజేయబడినవాడు నీడగల వృక్షము నాశ్ర యించి శ్రమను తీర్చుకొనునటుల తాపత్రయముచే సంతప్తుడగు నీ చేతనుడు వాసుదేవు డనెడు వృక్షముయొక్క నీడను సమీపించి విశ్రమించును తిరుక్కోవలూరునకు వేంచేయునపుడు తిరుమంగై

యాళ్వారులకు మార్గమధ్యమందున్న దివ్యదేశములలోని శ్రియఃపతి చరణారవిన్దములును, ద్వయమంత్రానుసంధానమును దారిబత్తెమైన ట్లును, ముక్తిమార్గమును కోరుచున్నవా రందరును అర్చిరాది మార్గమున నేగుదురన్నట్లు అర్చిరాది మార్గమే పెద్ద మార్గముగాను, బ్రహ్మాండమున కవ్వలకు గొనిపోయి యుజ్జీవింపజేయు స్వామి గాన మిక్కిలి యాప్తుడును, శేషశాయియును, కుటిలాలక కేశపాశుడును, పుండరీకదళామలాయ తేక్షణుడును, ప్రవాళాధరుడును, కాలమేఘనిభుడును, శ్రీరంగ నిత్యవాసియు నైన శ్రియఃపతియే దారికి తోడుగా నేర్పడును. విరజానదీ తీరమున్ను తిల్లైవృక్షమున్ను, ఐరంమ్మద సరస్తీరమున్ను, విశ్రమస్థలములుగా నుండును. తిరుమామణిమంటపమే ప్రవేశస్థలముగా నుండును. అర్చిరాదులను దారిని చూపు పురుషులే సల్లాపమునకు తోడుగా నుందురు. వ్యాప్తమైన ఆకసమున కలంకారముగ నుండు మేఘముల ధ్వనియే ప్రమాణపటహధ్వనిగా నుండును. హృదయమందున్న సర్వేశ్వరుడు వెలుగు నిచ్చి మార్గమున సంచరించునట్లు కృప చేయగా నీ ముక్తుడు పరమపదమునకు వెళ్ళుట కుద్యోగించును. అనాది కాలము తనను దాసునిగా చేసుకొని వచ్చిన సంసారమును వెనుకకు తిరిగి చూచి నవ్వును. పరమాకాశమందున్న పరమపదమును సేవించుటకు పూర్వమునుండియు నున్న యాశ పొంగి పైకివచ్చి పైపైగా వృద్ధిపొందగా సీతాపిరాట్టియును శ్రీ విభీషణాళ్వానును లంకలోనుండి బయలుదేరినట్లువలె హృదయకమలమునుండి బయలుదేరి హృదయమునం దున్న నూటయొక్క నాడులలో "సుషుమ్న" యను పేరుగల శిరఃప్రదేశమునం దున్న నాడియందు విద్యామాహాత్మ్యముచేతను నిరంతరము అర్చిరాది మార్గచింతన చేతను ప్రసన్నుడైన హృదయమందున్న సర్వేశ్వరుడు చేతదీపమును పట్టుకొని ముందుపోగా నీతడు పోయి శిరఃకపాలమును భేదించి యానాడి సూర్యమండలమువరకు నుండును గాన దానిద్వారా నా

సూర్యరశ్ములచేత నూర్ధ్వముగా గొనిపోబడి సూర్యరశ్మి ననుసరించును ఆ పోవుటలో ప్రణవమను రథము నెక్కి మనస్సు సారథ్యము చేయుగా పోవునపుడు ఉభయవిభూతులును నూతన శోభను వహించును సముద్రము తన గాంభీర్యమునంతను వీడి క్రిందనున్న మన్నును మీదకు విసరివేసిన సంభ్రమ నృత్తమును జేసి ధ్వనిజేయును ఊర్ధ్వలోకములయందున్నవారందఱును కానుకలు చేతులయందుంచుకొని ఆకసమునం దంతటను పూర్ణకుంభములచే పూర్ణముగా చేసి ధూపములతోకూడ పుష్పవర్షమును వర్షించి ఈ ముక్తపురుషు డొకసారి బసచేసి పోవునా యను నాశచే నెదురెదురుగా మార్గమునందు విడుదుల నేర్పరతురు లోకము లన్నియు నదురునట్లు సముద్రఘోషము వలె వాద్యము లంతటను మ్రోయుగ మార్గస్థు లందఱును 'రండు, మా స్థానములను ప్రవేశించండి' అనుచు తమ తమ స్థానములను తమ యైశ్వర్యములను సమర్పింతురు కాంతిగల సుందరమైన నేత్రములు గల యాతివాహికుల భార్యలు 'ఈ స్థల మరాజకమై పడియుండదగునా? దీని నేలుకొను' డని మంగళాశాసనములను చేయుదురు మరుత్తులును వసువులును యీ ముక్తపురుషుడు త్వరపడి పోగా సర్వేశ్వరుడు మన కధీనమును గానించిన స్థలములను గడచిపోయినాడని యూరకుండక లోకాంతరములకు కూడ వెంబడించి వెళ్ళి యీతనికి వినబడునటుల స్తోత్రములను చేయుదురు, మిగిలినవారందఱును నమస్కరించుచుండగా గొప్ప సత్కారములతో గూడ పోవునపుడు ఛాందోగ్య, వాజసనేయ, కౌషీతకీ మొదలగు నుపనిషత్తులందు చెప్పుచున్న ప్రకారముగ ఆయా లోకాధిపతులగు నర్చిరాది పురుషులు ముందు నడచుచు మార్గమును చూపింపగా పోవుచుండును.

## 2

ఆ అర్చిరాదులలో ముందుగ అర్చిః పురుషుని సమీపించి యాతడు కొంతదూరము మార్గమునందు నడిపింపగా పిమ్మట అహః

పురుషుని, శుక్లపక్షాభిమానిని, ఉత్తరాయణాభిమానిని, సంవత్సరాభిమానిని, వాయువును సమీపించి వారు దారిని చూపింపగా సూర్యుని ప్రవేశించి, ఎదురుగా చూచుటకు శక్యము కానట్లు నిరవధికమైన తేజస్సుతో ఇతడు వేఱొక సూర్యుడో అనునట్లుగ వెళ్ళి ఆ మండలమును భేదించుకొని గ్రహ నక్షత్ర తారకలకు నిర్వాహకుడై యమృతస్వరూపుడై యుండు చంద్రుని సమీపించి యాతడు సత్కరింపగా పైగా పోయి యమానవుని సమీపించును. అతడు మార్గదర్శకుడై నడిపింపగా నందఱకు నాప్యాయనమును కలిగించువాడైన వరుణుడును, త్రైలోక్యపాలకుడైన దేవేంద్రుడును, దేవత లందఱకును నిర్వాహకుడైన ప్రజాపతియును నాదరించుచుండగా నాయా లోకముల కేగును. పిమ్మట వారి లోకములనుగూడ దాటి బ్రహ్మాండమునున్ను, దశోత్తరవిస్తృతమైన ఆవరణసప్తకమును, మూలప్రకృతిని్ని దాటిపోవుచుండును. పూర్వము సంసారిగా నుండు దినములలో పుత్రదారాదిమయమైన పాశములచే గట్టబడి, చివఱిదశలో యమదూతలచే లాగబడి, అంధకారావృతమై నీరును, నీడను లేని లోకమున విననంతనే వణకిపోవలసిన క్రూరమైన మార్గమునందు శునకములు తొడలయందు కఱచుచుండగా యమదూతల శక్తి శంఖు తోమర బాణ శూలాది ఆయుధములచే బాధపడి, వ్యాఘ్రముల వంటి రాక్షసుల నోళ్ళ కాహారమై, శరీరమంతయును రక్తము, చీమును కారుచుండగా, వానినే ఆకలి దాహ శాంతులకై త్రాగుచు, ముక్కు, ముఖము, దౌడలు పళ్లు చితికిపోయి, చేతులును, కాళ్లును ఊడిపోవునటుల ఈడ్వబడి మొఱపెట్టుకొనుచు పోయిన దుఃఖమంతయు పోవునట్లుగ, సుఖోత్తరమైన యీ యర్చిరాది మార్గమున నడుగిడినది మొదలుగ చూచినవా రందఱును సత్కరించుచుండ శీఘ్రగమనమున పోవుచుండును. ఇంతకు పూర్వము శబ్దస్పర్శాదు లనబడుచున్న సింహవ్యాఘ్రాదులకు దప్పి సంసార మనబడు పెద్ద తుప్పలో

నుండి బయటపడి తాపత్రయము లనబడు కారుచిచ్చునందు పడిన క్లేశమంతయు తీరునట్లు ఇప్పుడు వైతరిణికి ప్రతికోటియగు విరజానదిని సమీపించును. వాసనారేణ్వవకుంఠితమై, మేఘావృతమైన సూర్య మండలము వలెను, రాహుగ్రస్త చంద్రమండలమువలెను, బురదలో పడిన మాణిక్యమువలెను నున్న నీ ముక్తుడు విరజానది నీటియొక్క స్పర్శచేతమాత్రమే యా సూక్ష్మశరీరమునుగూడ బాసి యనేక వేల సూర్యులు చేరి యుదయించినట్లు కంటితో చూడ శక్యముగాని ప్రకా రముగ నిరవధిక తేజస్సు కలవాడగును. నాలుగు భుజములు కల వాడై, శంఖ చక్ర గదాధరుడై విరజా నదీతీరమున నీతని రాకకై వేచియున్న అమానవుని సమీపించును. ఆ యమానవు డీతనిని తన శ్రీహస్తముతో స్పృశించగా లావణ్య సౌందర్యాది కల్యాణగుణముల కాకరమై శుద్ధ సత్త్వమయమై, భగవదనుభవైక పరికరమగు శరీర మును ధరించును. ఇంద్రాది పదవులవలె కర్మసాధ్యమును నశ్వరమును గుణత్రయాత్మకమును నై యుండక భగవత్ప్రీతిసాధ్యమై నిత్యమై శుద్ధ సత్త్వాత్మకమై ఆనందమున కంతములేనిదై జ్ఞానమును కలుగ జేయునట్టియు, సనకాదులయొక్క మనస్సునకుగూడ గోచరము కాని దియు, భగవదానుకూల్యమే భోగముగా గల నిత్యసూరులచే సాం ద్రమై, వారిచేతనుగూడ పరిచ్ఛేదింప శక్యముకాని పరిణామమును, ఐశ్వర్యమును, స్వభావమును కలదైన దివ్యదేశమును సందర్శించి నమస్కరించును. అనుగమించు అమానవపురుషుడు గావించిన శంఖ కాహళ భేరీ ధ్వనులను విని యిచ్చట నుండువారందఱును పరుగెత్తు వారుగను, పడుచు లేచుచు నుండువారుగను, సంతోషించి యాల కించువారుగను, ఎచ్చట నెచ్చట యని వెతుకువారును, కంటికి భోగ్యమైన దృశ్యమును చూచితిమి చూచితిమని పెద్ద యారవార మును చేయుచు సంఘుసంఘములుగా బయలుదేరి తన కభిముఖముగా

వేంచేయుచున్న నిత్యముక్తులయొక్క యానందకలకలమును గాంచి యనుభవించుచు పెద్ద ప్రీతితో గూడ పోవుచుండును. భగవద్భుక్త శేషములగు దివ్యమాల్యములను, దివ్యాంజనమును, దివ్యచూర్ణమును, దివ్యవస్త్రములను, దివ్యాభరణములు మున్నగువానిని ధరించి, అయిదు వందల దివ్యాప్సరసలున్ను, నిత్యసూరులున్ను యెదురుగా వచ్చి బ్రహ్మాలంకారముచే నీతని యలంకరింతురు. ఈ యలంకారములతో నొప్పుచున్న ముక్తుని యిచ్చటివారు "ఆహా! ఈ యాభరణముల యొక్క యలంకార మేమి? ఆ బట్టకట్టే మేమి? ఆ నూతనమైన శోభ మనకు తలంప తగిన స్వభావము కలదా?" యని యాశ్చర్యముతో కొనియాడుచుందురు. పిమ్మట ననేక వేల ధ్వజములచేతను, ముత్యముల సరములచేతను, మేలుకట్లచేతను నలంకరించబడినదై, దివ్యస్త్రీలచే చుట్టువారు కొనబడినదై, భగవంతుని సంకల్పముచే కల్పింపబడినదైన యొక దివ్యవిమానమును గరుడాళ్వారు తీసికొని వత్తురు. దానియందీతని నెక్కించుకొని స్తోత్రమును జేయును. తిల్యకాంతార మువఱకు వెళ్ళగనే నానావిధమైన ఉపహారములను ధరించుకొని వేలుగ కొందరప్సరసలు ఎదురుగ వచ్చి స్తోత్రముచేసి సత్కరింతురు. తరువాత తిల్యగంధము బ్రహ్మగంధము మొదలైన యప్రాకృతమైన గంధముల నాఘ్రాణించుచు సర్వగంధుడై ధ్వజపతాకాదులచే నలంకరింపబడిన దివ్యగోపురమును సమీపించును. ద్వారములను గాచెడు పెద్దలు "మీరు వైకుంఠనాథుని దాసులైరి. కావున మీరు మావారే మా యధికారములందు ప్రవేశించుడు" అనుచు గొప్ప యాదరముతో సత్కరింతురు. అంత నీ చేతనుడు అట్టి జనులచే నిండిన యా ద్వారమును దాటి మనోనేత్రముల నతి ప్రయత్నముతో మరలించుకొని 'అయోధ్య' యనియు 'అపరాజిత' యనియు జెప్పబడుచున్న శ్రీ వైకుంఠ మనెడు దివ్యనగరమును ప్రవేశించి నమస్కరించును. వైకుంఠమునందలి కైంకర్యనిష్ఠులను గుణనిష్ఠులున్ను

"సముద్రజలము సహ్యాపర్వతమునందెక్కి తరంగించునట్లు సంసారము నందున్న నీతడు ఈదేశమునకు వచ్చునట్లు లభించినదే" యని యాశ్చర్యమును పొందినవారై కొనియాడుదురు. పిమ్మట ప్రత్యేక ప్రాసాదములు గల గరుడాళ్వార్లు, విష్వక్సేనులు మొదలగువారు తమ తమ గృహములకు తీసికొనివెళ్ళి, వీని నొక యున్నతాసనమునం దుంచి తమరు భూమియందు కూచొని తమ భార్యలు నీరుపోయగా శ్రీపాదములను కడిగి తమ భార్యలకు వీరి ప్రభావమును జెప్పి సత్కరించవలసినరీతిగా సత్కరింతురు. తరువాత శ్రీ శఠకోపమును శ్రీ చూర్ణములను పూర్ణకుంభములను మంగళదీపములనున్ను ధరించుకొని దేశాంతరగతుడై వచ్చిన పుత్రుని జూచిన తల్లులవలె చల్లని ముఖములు గల యువతులు వచ్చి యెదుర్కొనగా పెద్ద వీధిమార్గమున లోపల ప్రవేశించి దివ్యమైన ఆవరణ శతసహస్రములచే నావృతమై మేలిమి బంగారముచే చేయబడిన కోయిలను సమీపించి "శ్రీ వైకుంఠాయ దివ్యవిమానాయ నమః" యని దండముపెట్టును. ఒక మడికట్టు వర్షము పడినట్లు తన రాకచే చిగిర్చి పుష్పించిన సురపొన్న వృక్షము యొక్క నానావిధవర్ణములును గంధములును గల అప్రాకృతపుష్పములచే సాంద్రమై మకరందమును ప్రవహించుచుచున్న కల్పవృక్షముల తోటలతోను నానావిధములైన పుష్పములతోను, నానావిధ రత్నములతోను నేర్పఱచబడిన లీలామంటపములచేతను, ఆశ్చర్యజనకములైన క్రీడాపర్వతములచేతను, శ్రీ వైకుంఠనాథునకును పిరాట్టిమారులకును లీలాపరికరములై చెవులు గింగురుమనునట్లుగా భోగ్యములైన పలుకులు గల చిలుకలు, గోరువంకలు, నెమళ్ళు, కోకిలలు మొదలగువానిచే వ్యాకులములై మాణిక్యములు, ముత్యములు, పగడములు మొదలగువానిచే నేర్పరుపబడిన మెట్లు కలదియు, నిత్యముక్తులయొక్క హృదయములవలె చల్లనై స్వచ్ఛమై యమృతరసమయములైన జలములచే నిండినదై, నానావిధములైన పక్షిసంఘ

ములచే వ్యాప్తమై త్రుళ్ళి యంతటను స్రవించుచున్న మకరంద ప్రవాహముకలదై, సుందరస్త్రీలయొక్క ముఖములకును, నేత్రముల కును సదృశమైన తామరలు ఎఱ్ఱకలువలు మొదలైన అప్రాకృత పుష్పములుగల సముద్రమువలె దీర్ఘమైన తటాకములచేతను, నానా విధపుష్పపర్యంకముల చేతను పుష్పములయందవగాహించి మకరంద ప్రవాహమున మునిగి పాటలచే ననుమానింపవలసిన దైవభృంగముల యొక్క దివ్యగాంధర్వములచేతను, సమీపించినవారిని మైమరపించు చున్న దివ్యోద్యాన శతసహస్రములచేతను చుట్టువారు కొనబడి, నాన రత్నములచే నేర్పఱపబడిన స్థలములుకలదై, యనేకవేల రత్న స్తంభములచే నలంకృతమై, యుభయవిభూతులందున్నవారును ఒక మూల నిమిడిపోవునంత వైశాల్యము కలదై, తామరపువ్వులు, ఎఱ్ఱ కలువలు, చందనము, అగరు, కర్పూరము మొదలైనవానిని కలుపు కొని వచ్చుచున్న మందమారుతముచే సేవింపబడుచున్నదై, నిరతి శయానందమయమై విరాజిల్లుచున్న తిరుమామణి మంటపమును సమీపించును "ఆనందమయాయ మణిమంటప రత్నాయ నమః" యని దానికి నమస్కరించును అపరిచ్ఛిన్నమైన రసస్వరూపుడగు భగవంతుని నెల్లప్పు డనురాగించుటచే బాల్యమును పొంది వైకుంఠ నాథునితో సామ్యమును పొందినవారై తదనుభవముచే నుత్పన్నమైన సంతోషాధిక్యమును లోన నిముడ్చుకొనజాలక బైటకు త్రోవబెట్టి నట్లు సామగానము చేయువారును, అట్టి యానంద ప్రవాహమునందు కొట్టుకొనిపోకుండగ సౌశీల్య మనెడు నవలంబన స్తంభమును నాటు వారును, అచట వేంచేసియున్న తమ యాచార్యులను గూర్చి "ఆచార్యా! ఆభరణములచే గలిగిన తేజముతో విరాజిల్లుచు పుండరీకదళామలాయతేక్షణుడగు నుపకారకుడైన శ్రియఃపతిని కన బరచితిరిగదా" యనువారును, "సమీపించితిని సంతోషించి కైంకర్యమును జేసి నీపాదములను పొందితిని మా స్వామీ! ఇదియే

యుంకను కానలెను" అను వారును, "నా నీచత్వమును చూడక నా మనస్సునందు కలసినవాని సౌశీల్యమును నే నెట్లు చెప్పవలెనో యెఱుంగను. ఏమని చెప్పుదును ? మీరే చెప్పుడు" అనువారును, "నమో నారాయణాయ" అనువారును, విచ్ఛేదము లేకుండ జెప్పదగిన పెరియతిరుమంత్రము ననుసంధించువారును, ఆత్మసమర్పణము చేయువారును, "ప్రబలమైన పాపములు గల నన్ను చీల్చివేయుచున్న గుణములు కలవాడా" యని శరహతులవలె శ్రమపడువారును. దాస్యరస మున్మస్తకమై "నమః, నమః" యని చెప్పువారును నగుచుందురు. ఈప్రకారముగ ప్రళయసముద్రమం దల్లాడువారువలె ఆనందసముద్రమం దల్లాడి నిత్యముక్తులు చెప్పుచున్న చెవులకు భోగ్యములై ఋజువులైన శబ్దములను వినుటచేత ఇంతకు పూర్వము సంసారమున క్రూరమైన మాటలు గలవారి కఠినమైన మాటలను వినిన కష్టము తీరునట్లుగా చెవి కాహారమును పెట్టుకొనుచు పోయి దివ్యాస్థానమును సమీపింతురు. ఆ మహాసభయొక్క మధ్యను తమ కిరీటములయందు తమ కసాధారణములగు దివ్యాయుధ చిహ్నాలను ధరించి జోడించిన చేతులతో నున్న యస్త్రశస్త్రము లనెడి పేరులు గలవారై యున్న దివ్యపురుషులును, తమయొక్క సంకల్పముచే సృష్టి స్థితి సంహారములు చేయగల సేన ముదలియార్ (విష్వక్సేనులు) మొదలైన దివ్యపురుషులను మర్యాదను తప్పక క్రమముగ సేవించి యుందురు.

## 3

ఉభయవిభూతులును చిత్తరువులుగా నేర్పఱచబడి సర్వాశ్చర్యకరమైన శిల్పములు గల శ్లాఘ్యమైన సింహాసన మొకటి యుండును. దానిపై పన్నెండు రేకులై నానాశక్తిమయమైన దివ్యకమల మొకటి యుండును. దాని దివ్యకర్ణికయందు పుష్పసమూహముచేత విచిత్ర

మైన దివ్యయోగపర్యంక మొందుండును. దానిపైన యనేక వేల చంద్రులను కరగించి పోసినట్టువలె చల్లని కాంతిగలదైన తిరుమేని గలవాడై కల్యాణగుణముల కంతము లేకపోవుటచేతను సర్వవిధ కైంకర్యముల యందును పూనుకొన్నవాడై, కైంకర్యపరు లందఱకు నుపమానమై యుండుటచేతను అనంతు డనియు, శేషు డనియు తిరునామముగల ఆదిశేషు డమరియుండును. ఆయనకు భగవదను భవమును వెలిబుచ్చుట కనేకమైన నోళ్ళను తలలును గలవు. ఆయన విజ్ఞాన బలములకును శైత్య మార్దవ సౌరభ్యాది గుణములకును పాత్రమైనవారు. అట్టి తిరువనన్తాళ్వా ననబడు పడకయందు వెండి కొండ శిఖరమందు అనేక వేల సూర్యులు చేరి యుదయించినట్లువలె నున్న ఫణామండలములయందలి జ్యోతిర్మండలముయొక్క మధ్యను, ప్రపంచమున కధిపతినికూడ తన పూర్తి చేతనే పూర్ణునిగా జేయ దగిన పూర్తిని, పరిమళమునకుగూడ పరిమళము నొసంగు సుందర మైన కేశపాశమును, పుండరీకాక్షునికూడ తనకు విధేయుడై తన సౌందర్యమున నుక్కిరిబిక్కిరిచేసి తనయందు మగ్నుని చేయదగిన సౌందర్యమును కాన్తియును గల విశాలమైన నేత్రములను, భోగమున కపశ్యాపేక్షితమైన యలంకారములవలె బాల్యయౌవనముల మధ్య యందున్న యౌవనమును, నోటితో చెప్పినంతమాత్రముచేతనే కంది పోవునంత సౌకుమార్యమును గల చల్లని పద్మవాసినియగు లక్ష్మీదేవి యందు మిగిలిన దేవులయందువలె శాస్త్రము ననుసరించి ప్రవర్తించ నీయని భోగ్యతాప్రకర్షను కలిగియుండి, భోగారంభక్రీడయందే భగ వంతుని విశ్వరూపమును సంకోచింపజేయు మహిమకలదియై, దివ్య పరిజనులను ఆయా యవస్థల కనురూపముగ దివ్యపరిచర్యలయందు నియోగించుచున్నదియై సమస్తాత్మలకును నెప్పుడును సమానముగ నాశ్రయణీయమై శీల రూప గుణ విలాసాదులచేత భగవంతునకు తగి యున్న పెరియపిరాట్టిమారు (లక్ష్మీదేవి) కుడిప్రక్కయందు వేంచేసి

యుండగా, ఆమెను మించిన క్షమా దయాదిగుణములను నోటితో చెప్ప శక్యముగాని సౌందర్యమున్ను గలవారై యా లక్ష్మీదేవికి నీడవలె నుండు మిగిలిన యిద్దరు నాయ్చ్చిమారులును ఎడమప్రక్క యందు సేవించి యుండగా, వీరికి మధ్యను మూడు మెరుపు తీగలతో కూడి తామరలను పూచినదైన యొక నల్లని మేఘము వెండికొండపై కబళీకరించినట్లుగా నవగాహించినట్లు తిరుముఖమండల కాంతిప్రవాహమూర్ధ్వముఖముగా ప్రవహించినదో యనునట్లుండి ఉభయవిభూతులకును నిర్వాహకు డనెడు యంశమును సూచింపదగినదై తన కాంతిచే నితర కాంతుల నన్నింటిని మూసివేయుచున్న పరమపదనాథుని దీర్ఘమైన కిరీటమునున్ను, చూచువారి నేత్రములను, మనస్సును చీకటి క్రమ్మునట్లుగా చేయు నల్లని యుంగరములుగా జుట్టుకొనినట్టియు, అష్టమిచంద్రునినుండి యమృతధార పడుచున్నటులవలె ఫాలభాగమున ధరించిన పుండ్రము నొకతరి కప్పుచు నొకతరి విప్పుచు చలించుచున్న వికసించినపుష్పములుగల చల్లనైన తులసి పరిమళముగల నల్లని చల్లని పొడవైన కుంతలములును, సౌకుమార్యాతిశయముచే చిరిచెమటను చెమర్చినటుల యాశపడినవారిని బంధించుస్థానమనదగిన ఫాలభాగమును, వికసించి నల్లనైయున్న రెండు తామర పుష్పములను మదముచే నణచియాడుచున్న రెండు తుమ్మెద పంక్తులవలెనుండు శార్ఙ్గమను ధనువువలె వంగియున్న సుందరమైన కనుబొమలును, సంశ్లేషించిన వారికి రెండు మృత్యువులై మిగిలినవారిని తల్లివలె రక్షించునవియై చేతనులపట్ల వాత్సల్యాతిశయముచేతను పిరాట్టి నిరంతరకటాక్షముచేతను ఉభయవిభూత్యైశ్వర్యముచేత నెట్టినె 'పతిం విశ్వస్య, అను ప్రమాణ మవసరము లేకయే నతడు సమస్త లోకముల నేలుచున్న యరవిందలోచను డనునట్లు సర్వేశ్వరత్వ చిహ్నమై వేరొక సౌందర్యానుభవమునకు వెళ్ళనీయక తనకే యనన్యార్హ మగునట్లు చేయుచు త్రిపాద్విభూతినికూడ తనకు స్వాధీన

-మగునట్లు చేయునట్టియు పరస్పరము స్పర్థకలవగుటచే త్రుళ్ళిపడు చున్న మత్స్యద్వంద్వములవలె మనోహరములై దూతకృత్యములను చేయు నేత్రములును, ఉన్నతమైన కల్పవృక్షముయొక్క లతమో చిగురో యని సందేహమును బుట్టించు సుందరమైన ముక్కును, దాని యొక్క చిగుళ్ళుదయించుచున్నట్లున్న దివ్యగండస్థలమున్ను దాని యొక్క నూతనమైన పుష్పములో యనునట్లున్న, ఆణిముత్యముల కాంతి వ్యాపించునట్లున్న పూర్ణచంద్రుడు పరిపూర్ణమగు వెన్నెలను ప్రసరింపజేయునట్లు నున్న దంతకాంతిని ప్రసరించు మందహాసమున్ను, సౌందర్యమున కాకరమై పగడమువలె స్నిగ్ధమై దానినుండి బయలు వెడలు మాటలను వినవలెనను ఆసక్తినికూడ పుట్టనీయక దానిని చూచినంతనే మనస్సునుకూడ హరించునట్టి చాటుభాషణముల కాకరమైన దివ్యాధరమున్ను, అత్యుజ్వలమై ప్రీత్యతిశయముచే పుట్టు శిరఃకంపముచే చలించి దిగంతములకు వ్యాపించు కాంతులను వెద జల్లుచున్న మణిఖచితములగు మకరకుండలములును, సకలకళాపరి పూర్ణమై సర్వాహ్లాదకరమై కళంకరహితమైయున్న చంద్రమండల మును, అప్పుడు వికసించిన యెఱ్ఱతామరపుష్పములను అధఃకరించి చూచినవారిని వ్యామోహింపచేయుచు తన కాంతియే తన కాభర ణముగా గల సుందరమగు ముఖమును, దేవిమారులయొక్క హస్తా భరణములచేతను, ముద్రితమై శంఖముతో సమానమైన కంఠమును, దృఢమై ఉభయవిభూతులను రక్షించదగినవై తన కుభయవిభూతు లను స్వాధీనపరచు దివ్యాస్త్రములచే పుష్పించినవో యనునట్లున్న విలక్షణమైన భుజములను, శ్రీ మహాలక్ష్మీదేవి కంతఃపురమై నిత్యము ననుభవించుచున్నను క్షణవిశ్లేషమునుగూడ సహింపలేనంతటి వ్యా మోహమును బుట్టించునదై, వనమాలా విరాజితమై, అమూల్యమను మణిహార మౌక్తికహార కౌస్తుభాదుల కాకరమై ప్రకాశించుచున్న వక్షఃస్థలమును, దివ్యమంగళవిగ్రహమున కలంకారమై సౌందర్య

ప్రవాహామున కడ్డు గట్టుకట్టిరో యనునట్లున్న తెల్లని యజ్ఞోపవీత
మును, నిత్యముక్తులయొక్క హృదయములయందు సౌందర్యమును
గంతులిడ జేయుచున్న ఉదరబంధమును, సౌందర్యసాగరము ఇరుకు
ప్రదేశమున పడి సుడితిరుగునట్లు మనస్సును నేత్రములను సుడిలో
పడవేయుచున్న నాభియు, పాంచజన్యము, చక్రము చంద్రసూర్యు
లుగా దలంచి వికసించుచును ముకుళించుచునున్న బ్రహ్మకు స్థానమైన
నాభికమలమును, సంధ్యారాగముచేత రంజితమైన ఆకాశమువలె
నున్న నడుమునకు శోభనుకలుగజేయుచున్నదై నడుము పూచినదో
యనునట్లున్న పీతాంబరమును, అరటిస్తంభములవలెనున్న గంభీర
మైన తొడలును, తామరకాడవలె గగుర్పాటుగల పిక్కలును,
శంఖ చక్ర కల్పక ధ్వజారవిందాంకుశ వజ్రరేఖలచే చిహ్నితములై
నాయ్చ్చిమారులుకూడ కందునోయను సందేహముతో స్పృశించవల
సిన మిక్కిలి మృదువైన పాదములును,లావణ్యసాగరముయొక్క తరం
గములో యనునట్లున్న వ్రేళ్ళున్ను వానియందనేక చంద్రు లుద
యించెనో యనునట్లున్న నఖములును వజ్రములనుగూడ కరగించు
నదియై స్త్రీలను మర్యాదలను మీరజేయునదియై చూచినంతనే
తాపము నుపశమింప జేయునదియై నల్లనై చల్లనై నిత్యసూరుల
యొక్కయు మనోనేత్రముల నాకర్షించునట్టియు, భక్తులకు జీవనౌష
ధమై, చాతుర్యమునకు నిలయమై, మనోరథముల కవిషయమై,
వేదాంతవాక్యములకు సర్వస్వమై, దివ్యాత్మస్వరూపమునకు ప్రకాశ
కమై, ఆయుధాభరణ తేజఃప్రవాహమునం దూహించి గ్రహించవలసిన
దైవ దివ్యమంగళవిగ్రహమును, సదా చూచుచుండు నిత్యసూరుల
చూపునుగూడ సహింపజాలని సౌకుమార్యమునుకలదై శ్రీవైకుంఠము
నంత నొక్కరీతిగ పరిమళింపజేయుచు కటాక్షామృతవర్షముచే నిత్య
ముక్త దివ్యగోష్ఠిని పల్లవితకుసుమితముగా నొనర్చుచు ఉభయవిభూతు
లనుగూడ నాసనబలముచేత జయించి వేంచేసియున్న యీ వై

నాథుని సేవించున దెపుడో యనెడు ముక్తుని యార్తి తీరునటులగా కనులార సేవించి 'సమస్తపరివారాయ శ్రీమతే నారాయణాయ నమః' అని సాష్టాంగప్రణామము నాచరించి ఆనందపరవశుడై పడుచు లేచుచు, కూర్చుండుచు పరుగిడుచు నిరతిశయప్రీతితో నేగి పాదపీఠమునం దడుగుపెట్టి దివ్యసింహాసనము నధిరోహించును. అంత నా సర్వేశ్వరుడు చంద్రుని జూచిన సంద్రమువలె నుప్పొంగి తన నెడబాసి చాలదినములు భూమియందు పడియున్న కష్టము తీరునటుల తన తొడయందు భరతుని కూర్చుండబెట్టుకొనిన ట్లీతని నెత్తి యొడియందుంచుకొని అక్రూరుని కౌగలించుకొనినట్లు కౌగలించుకొనును. అంత ముక్తేశ్వరుల కీవిధముగ సంభాషణ జరుగును.

శ్రియఃపతి — నాయనా! నీ వెవరవు?

ముక్తుడు — నేను నీకు శరీరమువలె ఆధేయమై, విధేయమై, ధార్యమై, శేషమైయున్న రాజకుమారుడను.

శ్రియఃపతి — నీ వింతకాల మేమి జేసితివి?

ముక్తుడు — భోగలాలసుడనై, ఇంద్రియారాముడనై ఆనందసాగరాంతర్నిమగ్నుడనై యుంటిని.

శ్రియఃపతి — నీకు దానిచే లభించిన ఫల మేమి?

ముక్తుడు — ఘోరమై క్రూరమైన నరకములయందు పడరాని క్లేశములన్నిటి ననుభవించితిని.

శ్రియఃపతి — పిమ్మట నేమిచేసితివి?

ముక్తుడు — ఇదిగో, నీదరి జేరితినిగదా!

శ్రియఃపతి — దీని కేమి యుపాయము నవలంబించితివి ?

ముక్తుడు — పుణ్యస్వరూపుడవగు నిన్నే.

శ్రియఃపతి — నన్ను సమీపించి నీవు పొందిన ప్రయోజన మేమి ?

ముక్తుడు — నాయొక్క క్రూరమైన పాపములను పోగొట్టుకొంటిని.
ఆనందమున కంతములేని యీ దేశమునందు వర్తించితిని.

అని విన్నవించగనే

శ్రియఃపతి — బాబూ! క్రూరమైన లోకములయందు చాలకాలము తల్లడించితివే. అనేకజన్మలయం దనేక దుఃఖముల ననుభవించితివే. అయ్యో! అవి యన్నియు నిస్సారములని నిశ్చయించి "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే" యనినతోడనే మేము నీకడకు వచ్చి ముఖమును కనబరచలేకపోతిమే. తలను పైకెత్తి మే మున్న దేశమును లక్షించి యేడ్చుచు నమస్కరించుచు 'దయామయా! నన్ను పిలుచుకొను కాల మింకను సమీపించదా ? నిన్నిక యేనాడు వచ్చి కూడుదుమనని' నీవు బాధపడున ట్లాలసించితిమో! దానికి మన్నింపుము. ఆ కష్టము లన్నియు తీరునట్లుగా నీ వీనాడు మమ్ములను సమీపించితివి నీ తాపము లన్నియు తీరినవి. మా సృష్ట్యాది వ్యాపారము లన్నియు సఫలమైనవి. మా కలభ్యలాభమైనది. నీరాకచే నీ దేశము సనాథమైనది. ఈ నిత్య ముక్త గోష్ఠికి నీవు సమీపించి యౌజ్జ్వల్యము నాపాదించితివి. నాయనా! నడచివచ్చిన కాళ్లు నొచ్చినవా ? యని వందిమాగధులవలె స్తోత్రము చేసి మనోహరములగు చాటువాక్యములచే ముక్తపురుషుని చల్లబరచును. వ్యాధిని విడచి ఆరోగ్య స్నానమును చేయించిన పుత్రుని తండ్రి చూచునట్లు చూచి తూమును తెరచి నీటిని ప్రవహింపజేయునట్లు తన పుండరీకదళాయతేక్షణములనుండి కటాక్షామృతమును ప్రవహింపజేయును.

దారి పొడుగునను ముక్తపురుషుడు మనోరథించిన మనోరథముల నన్నింటిని సఫలపరచును. విడచి విడచి కౌగలించుకొనుచుండును. ఆహా! ఇది చిత్తమోహమా? భ్రమయా? యని గొప్ప వ్యామోహ మును చెంది పెరియపిరాట్టిమారులచేత కందించును. ఆమె కంస వధానంతరము కృష్ణుని జూచిన దేవకీదేవికివలెనే యుబ్బి ప్రవహించు చున్న స్తన్యముచేత వీనిశరీరమును తడుపుచు కౌగలించుకొనును. శ్రీ, నారాయణు లిరువురును తమ విభూత్యైశ్వర్యము నీతని కొసంగు దురు. అంత నీముక్తపురుషుడు భగవంతుని యొడినుండి దిగివచ్చి ముందున్న సౌందర్యము ననుభవించి తట్టుకొనజాలక ప్రక్కల కేగియు, వెనుక కేగియు సౌందర్యానుభవముచే చంచల చిత్తవృత్తి గలవాడై శిరమున నంజలి జోడించి యాశ్చర్యచకితహృదయుడై మరియొకదానియందు మనస్సు వెళ్ళక "ఆహా! హాహాహా! హాహాహా!" యని సామగాన మొనరించును. ఆహా! నా భాగ్యమేమి? శ్రియఃపతీ! నా తల్లితోకూడికొనియున్న నిన్ను ఈయప్రాకృత దివ్యదేశమున నీ స్వస్థానమున సేవించగలిగితిని నీ తిరువడినే యాశ్రయించితిని. నన్ను నీ పాదద్వంద్వములచెంత నుంచుకొనుము స్వామీ! యని ప్రీతితో నోరార నుతించును. శ్రీవైకుంఠనాథుడును చల్లని చూపు లతో కటాక్షించి మందహాసముతో సుకుమారమైన తన పాదద్వంద్వ ముల నీతని శిరస్సున కలంకరింపజేయును. ఈతనిని తన నిత్యకైంక ర్యమున నియోగించును. అంత నీ ముక్తపురుషుడు చరమదేహ ముతో తా నాశించిన సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును సర్వేశ్వరుని సర్వవిధముల కైంకర్యములను చేయవలె ననెడి యభి నివేశాతిశయముచే ననేకదేహములను పరిగ్రహించి సమస్త శేష వృత్తులయందు నన్వయించుచు, అవసరము లేకున్నను ప్రీత్యతిశయ ముచే భగవంతుని రక్షణయందు వ్యసనముగల నిత్యసూరులతో

గూడియుండి భగవంతునకు నిత్య మంగళాశాసనమును గావించు చుండును. అమృతసాగరాంతర్నిమగ్నమైన సమస్తావయవములు గల వాడగుచు యావ దాత్మభావిగా నటనుండి ఉత్తరోత్తరానందమును పొందుచుండును.

